# మహిమాంగనలు

[ ప్రథమ భాగము. ]



గ్రంథకర్త.

# మహిమాంగనలు

[ ప్రథమ భాగము

గ్రంథకర్త

కొడాలి సత్యనారాయణరావుగారు.

పబ్లిషర్సు:

కాసంశెట్టి కృష్ణమూర్తి.

ప్రొప్రయిటర్.

కాసంశెట్టి శేషగిరిరావు అండ్ బ్రదర్సు,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు. ఏలూరు.

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు.

శ్రీ పాండురంగ ముద్రాక్షరశాల, ఏలూరు.

1932.

 (వెల రు ౧-5-0



పాలి వేంకట మునియ్యగారి స్వకీయమగు

ఏలూరు శ్రీ పాండురంగ ముద్రాక్షర శాలయందు

ముద్రింపఁబడియె.



శ్రీరామచంద్ర.

# మహిళాంగనలు

## 1. చంద్రమతీదేవి.

పరమశీలంబును, భయనివారణంబును, నిఖిలశోభన కారణంబును బతిభక్తియందే యిమిడియున్నవనెడి నమ్మకముతోడనే పరమసాధ్వులగు సీత, దమయంతి, సావిత్రి మున్నగువారు తమ జీవితములఁ గడపి, స్వానుభవమునఁ బాతివ్రత్యమాహాత్మ్యములఁ దెలిపికొని, సాధ్వీలోకంబునకు మార్గదర్శినులై విలసిల్లిరి. ఇట్టి నారీమణుల జీవితకాలము గతించి కొన్నిలక్షల సంవత్సరములైనను వారి జీవితచరిత్రలు మాత్రము యుగంబులు గతించినకొలఁదియు రాణించుచునేయున్నవి. ఇటులెంతకాలమువఱకు రాణించునో చెప్పుట మానవున కశక్యము. మన మంతటివారము కాఁజాలకున్నను, వారి మహత్తరవిశేషములనెఱింగి ప్రవర్తించినచో హైందవాంగనలే ప్రపంచసౌఖ్యమున కాధారభూతు లనియెడికీర్తి శాశ్వతముగా నిలువఁగలదు. ఈనాఁడు మాత్ర మెందఱు నారీమణులు తమ యుత్తమ ప్రవర్తనముచేఁ గీర్తిని సంపాదింపలేదు? కాన నీ విషయ

ముల వనంబున శాశ్వతముగా నిల్పుకొని కొందఱు మహా మహాంగవల జీవితములు గొంతవఱకైన నెఱింగి ధన్యుల మగుదము.

కృతయుగంబున షట్చక్రవర్తులలోఁ బ్రథముఁడై వాసి కెక్కినవాఁడు హరిశ్చంద్రుఁడు. వాని పవిత్ర జీవిత చరిత్ర మును ననేక విధంబులఁ దెలిసికొనుచునే యున్నాము. మన మిపుడు పఠింపఁదలఁచిన చంద్రమతీదేవికథ మఱల నా మహా నీయుని చరిత్రమునే స్మరణకుఁ దెచ్చును. ఉత్తముల దివ్య కథల నెన్నిపర్యాయములు పఠించినను విసుగు జనింపదు.

చంద్రమతీదేవి హరిశ్చంద్రుని భార్య. ఆబిడ మయుని కూఁతురని వాకొందురు. ప్రస్తుతమున కామె జీవిత విశేషము లను సంగ్రహముగాఁ దెలిసికొందము. ఆ తలోదరి బాల్యము నాఁటఁగోలె సకల సద్గుణవిరాజితయై విలసిల్లినను, సత్యవాక్పరి పాలనాధురంధరుఁడైన శ్రీహరిశ్చంద్రుని యిల్లాలయినదాది గనే యామెకీర్తి దిగంతముల వ్యాప్తమైనది.

(2)

ఒకనాఁడు దేవేంద్రుని కొలువుకూటమున సత్యవాక్ప్రి యుం డెవ్వఁడనియెడి ప్రశ్నంబు బయలువెడల, నందుఁగల వసిష్ఠమహర్షి హరిశ్చంద్రునిఁ బేర్కొనె. వసిష్ఠుని వాక్యమును బూర్వపక్షమొనరింప విశ్వామిత్రుండు పడరాని పాటులఁ

బడి, యెట్టులేని హరిశ్చంద్రుని బొంకించి తీఱెదనని యా నిండుకొలువునఁ బ్రతిజ్ఞ నొనర్చి, తానొనర్చెడి క్రతువునకు ధనంబు కావలయునని మిషతో హరిశ్చంద్రుని యాస్థానమునకుఁ జేరె. హరిశ్చంద్రునకు మహర్షులఁ బూజించుట యలవాటుకాన నట్టులనే సకలమర్యాదలఁ గావించి వానికోరికఁ దెలిసికొని, వలయు విత్తంబుఁ గొనిపొమ్మన సమయము వచ్చినపుడు గైకొందునని పలికి యా విత్తంబునట నేయుంచి వెడలిపోయెను.

హరిశ్చంద్రు నసత్యవాదిఁగాఁ జేయుటయే గాధినందనునకుఁ బ్రస్తుతోద్యోగముగాన వెంట నేకొన్ని ఘాతుకమృగంబులఁ గల్పించి పౌరులపొలములపైకిఁ బ్రేరేపింప నాక్రూరజంతువుల దారుణబాధల కాగఁజాలకఁ బౌరులుతమ ఱేఁడగు హరిశ్చంద్రునితో మొఱవెట్టుకొనిరి. ప్రజాసౌఖ్యమే తనసౌఖ్యముగ నెంచుకొని ధరాపాలనంబొనరించు హరిశ్చంద్రుఁ డామృగంబుల వధించి పౌరుల కష్టములఁ బాపఁ బయనమగుడు పతివ్రతాతిలకంబగు చంద్రమతీదేవియు నామృగయావినోదముఁ జూడ నర్థింప హరిశ్చంద్రుండు సమ్మతించి భార్యను, కొమరుండగు లోహితాస్యుని, యమాత్యశేఖరుండగుసత్యకీర్తిని, వలసిన పరివారంబును వెంటఁగొనియరణ్యమును జేరి వేఁటఁబూర్తిఁ గావించి యాపరిసరప్రదేశంబందే వసిష్ఠమహర్షి యాశ్రమంబుండుటచే కులగురువును దర్శింపకుండ మఱలుట భావ్యము కాదని

తలంచి యటకరిగి, వానియాశీర్వాదంబులఁ బడసి యొకచో
వేఁటతమకంబున విశ్రాంతి నందియుండె.

గాధినందనుఁ డాయుదంతం బెఱింగి మాలితెలఁ గొం
దఱ సృష్టించి మెట్లయిన హరిశ్చంద్రుని వంచించి రావలయు
నని నియోగించి యటకంపెను. వారును దమతమసాధనముల
నన్నిఁటిఁ బ్రయోగించి చూచిరికాని ప్రయోజనము సున్న
యయ్యెను. మీఁదుమిక్కిలి తాము ప్రవర్తించిన విధానము
లకు సత్యకీర్తిచేఁ బ్రహరింపఁబడిరి. ఆమతంగకన్యలునురోదనం
బొనర్చుకొనుచుఁ బరువెత్తి విశ్వామిత్రునితో మొఱవెట్ట
నాతండు దండతాడిత భుజఁగంబుకరణి మండిపడుచు వచ్చి
హరిశ్చంద్రునిఁ గాఱుకూతలుఁగూసి యామతంగకన్యలఁ బరిణ
యమ్ముఁగమ్మని నిరోధించెను. అందులకు ఱేఁడొప్పలేదు.
"ఋషిసార్వభౌమా! నేనేకపత్నీవ్రతస్థుఁడను. నన్నిటుల నిర్బం
ధించుటభావ్యముకాదు. నేనిట్టిదుష్కృత్యమొనర్చి లోకములోఁ
దలనెత్తికొని తిరుగఁజాలను. నన్ను క్షమియించి విడువుఁడు.
చివఱకు నారాజ్యభోగాదులనైన విడిచెదనుగాని యీకార్యం
బెనోనరింపనొల్ల"నని మొఱవెట్టెను.

(3)

భూమండలాధిపత్యముపై నాస కలిగి కుశికనందనుండు
తనకోరిక హరిశ్చంద్రునకుఁ దెలుప నటనుండియే దేవబ్రాహ్మణ

మాన్యములు విడచి తనకున్న రాజ్యభోగంబులన్నిఁటి సంతోష పూర్వకముగా గాధినందనునకు ధారవోసి రాజలాంఛన మగు దుస్తులవిసర్జించి కావిబట్టలు గట్టుకొని భార్యాసహితుఁడై కొమరు నెత్తుకొని నట్టడవుల కరిగి యందు జీవింప బయలు దేరెను.

వెంటనే విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రునిచేయి గట్టిగాఁ బట్టుకొని "మున్నుయజ్ఞార్థ మొసంగిన ద్రవ్యమిచ్చి కదులు" మని నిలువఁబెట్టెను. పాపము! హరిశ్చంద్రుఁ డేమి సేయఁ గలఁడు ? ఒక నెల గడువుఁ గైకొని యెవ్విధముననేని నప్పుఁ దీర్ప నిశ్చయించుకొని యా విషయంబు గాధినందనున కెఱిం గింప నాతండు తన శిష్యుండగు నక్షత్రకుని తోడుగా నిచ్చి తన ద్రవ్యమును వానికొసంగు మని యాజ్ఞాపించె.

అటనుండి బయలుదేరిరి. చంద్రమతి పాదముల నిండ ముండ్లుగుచ్చుకొనుటచే రక్తముప్రవహింపసాగెను. సూర్యా తపము మిక్కుటమగుటచే శరీరము వాడుచుండెను. నడక వలనఁ గలిగిన బడలికచే నామెకాయాస మధికమగుచుండెను. ఆమె స్థితియే యట్లుండఁ నిఁక నైదేండ్ల ప్రాయముఁ గలవాఁ డగు లోహితుని గూర్చి యనుకొన నేల ? తన మూలమునఁ దన భార్యకును, సుతునకును నట్టి దురంతకష్టములు వాటిల్లి నవి గదా యని దుఃఖించుచుండఁ జంద్రమతి వాని వదనముఁ

గాంచి "నాథా! మనమీవిధి నేడ్చిన మాత్రానఁ గష్టములు తొలంగునే! విరించి మన ముఖంబుల రచించిన రచనములకు మార్పులు గలుగఁ గలవా! మున్నెన్నఁడైన నటుల జరిగి నటుల విని, కని, యెఱుంగుదుమా! ధైర్యస్థైర్య హిమాద్రు లనఁ బఱఁగిన మీరే యిటుల విలపింప మాయట్టి యబలలకుఁ గర్తవ్య మేమున్నది? మన యవస్థను జూచి కుఱ్ఱఁడడలఁడే!" యని తగు శాంతి వచనములఁ బల్కుచుఁ బెనిమిటికి ధైర్య మొసంగుచుండెను.

ఆమహారణ్యమున వీరటులనే నడువఁగా నడువఁగా శ్రమంబధికమగుట నొకచో విశ్రమించిరి. హరిశ్చంద్రుఁడు మాత్రమయ్యది ఘోరాటవి యగుటచేతను, క్రూరమృగ ములకావాస మగుటచేతను, నిదురఁబోకఁ జంద్రహాసంబును జేత ధరించి వారినిఁ గావలిఁ గాయఁ జొచ్చెను. ఈ సమయములో భూత, ప్రేత, పిశాచముల కధినాథుఁడగు భేతాళుండు తన భయంకరార్భటిని జూపుచు వచ్చుచుండ నందఱకు నిద్రాభంగమువాటిల్లఁగలదనితలంచి వాని గర్వంబుఁ ఖర్వంబుఁ గావించెను.

(4)

హరిశ్చంద్రుండు భేతాళునితోఁ బోరాడినపుడు పాపము చంద్రమతికిని, లోహితాస్యునకును, నక్షత్రకునకును నిద్రా

భంగమువాటిల్లినది. అక్కటికింకఁ జాలపొద్దుండుట చేవారినందఱిని మఱికొంతతడవు నిద్రింపుమని హరిశ్చంద్రుండువారలఁగోరెను. కాని నక్షత్రకుని యార్భాటములవలన నప్పుడే నడకసాగింప వలసి యుండుటచే హరిశ్చంద్రుఁడు వారినందఱి వెంటనిడుకొని మఱలఁ బ్రయాణమై కొంతదూరము పోవుసరికి, నాయరణ్యంబున నొకచో దావానలంబు చెలరేగి భీషణముగ మండుటచే బాలుండగు లోహితాస్యుండును, భీరుండగు నక్షత్రకుండును దహతహఁబడసాగిరి. హరిశ్చంద్రుఁ డీయవస్థలఁజూడఁజాలక నాయగ్నిహోత్రుని శరణుఁబొంద నిశ్చయించుకొనెఁగాని చంద్రమతి మహాసాధ్వియగుటఁజేసి భర్త యుద్యమమును నివారించి స్వాహావధూవల్లభునిమనసారఁ బ్రార్థించి యందుఁజొచ్చె నంత నా యగ్నిదేవుండు కరుణించి శీతలుఁడై వారినందఱి సంరక్షించెను.

అటనుండి వీరందఱును గంగాతీరముఁజేరిరి. ఆమహానదీ యలలఘోషములనాలించిరి. ఆనాదమునకెంతయు నుప్పొంగిరి. అటను మిణుకుమిణుకుమంచుఁ గాన్పించు విశ్వేశదేవాలయ గోపురమును దిలకించిరి. "ఆవిశ్వేశ్వరుఁడే మమ్ములనాదరించుఁ గాక" యని మనంబునఁ గోరుకొనుచు నమ్మహాదేవసందర్శన కుతూహలోపేతులై నడకచేఁ గలుగుచున్న శ్రమంబునేమి లక్ష్యము సేయక వేవేగముగ నడచి వారణాసీపురిఁజేరిరి.

పావనక్షేత్రంబులకెల్ల నగ్రగణ్యమై, గంగానదీతటస్థమై యొప్పారెడి వారణాసి యీనాఁటిదికాదు. సామాన్యమైన పురముకాదు. యుగములుమాఱినవి. మనుజులుమాఱిరి. గుణములుమాఱినవి. కాని వారణాసి మాఱలేదు. ఆపత్తనంబు నేఁటికిని శాశ్వతానంద దాయకమై మోక్షపదవి నొసంగుటకై సకలజనుల నాహ్వానించుచున్నది.

విశ్వనాథునకును విశాలాక్షికిని బక్షపాత బుద్ధిలేదు. ధార్మికవృత్తియందు మార్పులేదు. న్యాయపరిపాలనమునం దేవగింపులేదు. ఈనమ్మకము హరిశ్చంద్రునకు బాగుగాఁగలదు. కావుననే కాశిఁ జేరినతోడనే మొదట గంగాజలంబులనందఱి స్నానములఁజేయించి, తానుఁగూడ మునింగి, విశ్వనాథుని సందర్శించెను. అసమయంబునఁ బతివ్రతా తిలకమగు చంద్రమతి తనభర్తకుఁ గలిగిన దురవస్థలనెల్లఁ దొలఁగింపుమనియుఁ, దన సాధ్వీత్వమును జిరకాలము నిలుపుమనియుఁ, గుమారున కఖిల సౌఖ్యములఁజేకూర్పుమనియుఁ బ్రాంజలియై ప్రార్థించెను.

నక్షత్రకుఁడు వీరివెంటనూరకరాలేదు. తనకీయవలసిన ఋణమునుహరిశ్చంద్రునియొద్దనుండిమొట్టులేనిరాఁబట్టుమనియు లేకున్నసబద్ధమాడింపుమనియుఁ బ్రబోధించి విశ్వామిత్రుఁడంపవచ్చినాఁడు. గురునియుపదేశమునననుసరించియావటూత్తముఁడు హరిశ్చంద్రునిఁ బాంకింపఁదలఁచి యెన్ని విధంబులుగనో ప్రయ

త్నించెను. కాని వాని యత్నము లన్నియు విఫలమయ్యెను. హరిశ్చంద్రుండు గాధేయునకీయవలసిన ఋణము నెట్లులైనఁ దీర్చుటకే నిశ్చయించుకొనియు వటూత్తమునితోడఁ గేమియు గత్యంతరముఁ గానక విచారించుచుండ మహీమాంగన యగు చంద్రమతి "నాథా! ఆపదలయందే ధైర్యమువహింపవలయును. సకలజ్ఞులగు మీరే యిటుల విలపింప మమ్ముల నోదార్చువా రెవరు? విధివశంబున సకల సిరులను గోల్పోయితిమి. మీకు నేను; నాకు మీరును మిగిలితిమి. ఋణబాధ మీమనో వ్యథను హెచ్చించుచుండె. మీకిప్పట్టున స్వతంత్రమైనదానను నేనే గదా! నన్నే భాగ్యవంతునకైన విక్రయించి యాముని ఋణముఁ దీర్చుకొను"మనియాలోచనముఁ జెప్ప నట్టియోగ్యు రాలిని బరులకు విక్రయింపవలసివచ్చెనే యని యెంతయుఁ జింతించియు నన్యగతిఁ గానక నట్టులనే యొనర్ప నిశ్చయించు కొని నడిబజారునకుఁ గొనిపోయి యటఁ బౌరులందఱిని సమ కూర్చి వారందఱకుఁ దన యుద్యమ మెఱిఁగింప గాధేయునిచేఁ బ్రబోధింపఁబడిన బాలచంద్రకోటీరుండే కాలకౌశికనామంబుతో బ్రాహ్మణవేషముతో నట నవతరించి యీయింతిని కొని యప్పటినుండి తన యింట దాసిగా నియమించెను.

చంద్రమతి బ్రాహ్మణునకు విక్రయింపఁబడి వాని గృహంబున కరుగునపుడు తనకుఁ గలిగినభర్తృవియోగమును భరియింపలేకఁ బెనిమిటిని గాఢాలింగన మొనర్చుకొని యొక్క-

పెట్టుచు రోదన మొనర్చెను. పతిసేవ కానాఁటితో ఋణము తీఱిపోవుచున్నదేయని ఘోషించెను. ఐన నా యిల్లాలి కాయెడఁ బాటు తప్పినది కాదు. తన దుఃఖమును తానే దిగమ్రింగి, యెన్నఁటికేని ధర్మప్రవర్తనమే తమ్ముఁ గాఁపాడఁ గలదని ధైర్యమ్ము వహించి, పతికిఁ దగిన హితమ్ముఁ గఱపి సుకుమారుండగు సుతుని వెంటఁగొని యేగెను.

[5]

కాలకౌశికునిభార్యముకోపి.విఱపసగొయ్య.గయ్యాళి. పతి తనయాజ్ఞకుఁ లొంగి, సకలోపచారములొనర్పవలయును. గొడ్రాలగుటచేత దయాదాక్షిణ్యము లామెహృదయకోశమున నే మూలఁ గాన్పింపవు. ఆబిడ కలహాకంటకి యనియెడి తన నామమును సకల విధముల సార్థకముఁ జేసికొనుచుండెను. కాని యామె హృదయ మట్టి స్థితియందుటకుఁ గల కారణం బేమి ? ఆపె యెవరు? శివుండు కాలకౌశిక వేషధారియై, నిత్య సత్యవ్రతాచార సంపన్నుఁడగు హరిశ్చంద్రుని, ఘోరవిషమపరీక్షలచే మనోధైర్యములఁ గనుఁగొనఁదలంచి నపుడు కలహాకంటకి గౌరీదేవియే యని వేఱుగఁ జెప్పుకొనవలయునా ?

చంద్రమతీదేవి కాలకౌశికుని గృహంబున నడుగుఁ బెట్టినదాది నాఁటనుండఁ గలహాకంటకి యమ్మహాసాధ్విని సకల

విధంబులఁ గష్టపెట్టుచున్నను క్షమాగుణసంపత్తిచే వానినెల్ల నోర్చుకొని తన సుగుణసంపద కెట్టి కొఱంత రానీకుండ మెలంగుచుఁ గలహాకంటకి దన భర్తయెడఁ జూపు నిర్లక్ష్యము నకుఁ దన మనంబునఁ గటకటఁబడుచుఁ బాప మొకనాఁడు కలహాకంటకిఁ జేరి "అమ్మా ! నీకు నేను ధర్మోపదేశ మొనర్ప నంతటిదానను గాకున్నను నాటి యాఁడుదాననగుటఁ దోఁచి నంతవట్టుఁ దెల్పెద నాకర్ణింపుము. నిత్యంబును బ్రాతఃకాల మున నిదుర లేచినంతనే పతిపాదాబ్జములపై వ్రాలవలయును. పత్యుద్దేశముల నెఱింగి, వాని కనుగుణముగా వర్తింపవల యును. ఒడలు దాచుకొనకఁ బతికి సకలోపచారము లొనర్ప వలయును. స్త్రీజన్మ మెత్తినందుల కహర్నిశలును బతితోడి దియే లోకంబుగా మెలంగవలయును. తన ధర్మములఁ దానెఱింగి, వాని నాచరణమునఁ బెట్టుకొని నాటివారికెల్ల మార్గ దర్శకురాలై యొప్పవలయు. మన మొనర్చెడి ప్రతికార్యమును భగవంతుఁడు పరిశీలించునని జ్ఞప్తియందుంచుకొనవలయును. పరమేశ్వర నామోచ్చారణమును నేమఱకుండ వలయును. దయాసత్యశౌచముల ననుసరింపవలయును. పతివ్రతాధర్మముల ననుష్ఠించుటయే సతులకు సకల సౌభాగ్యములఁ బడయుటకు మూలమని నమ్మవలయు" నని కొన్ని హితంబులఁ దెల్పినంత నా కలహాకంటకి యా కాలమున కామెకు దొరసాని గాన నా హితంబులు రుచింపకఁ బాపమాయమ్మను జావమోదెను—

సదాచారనియమముల బోధించినందులకుఁ జంద్రమతికిఁ గలిగిన ఫలితమది. గయ్యాళులకును, శీలవతులకుండెడి తారతమ్యమిది. అటులఁ బ్రహారింపఁబడియుఁ జంద్రమతీదేవి తన సహనస్వభావమును వీడకుండెను.

చంద్రమతిని విక్రయింపఁగావచ్చిన ద్రవ్యమును నక్షత్రకుఁడు దారిబత్తెముక్రిందఁ జెల్లుపెట్టుకొనినందున గాధేయుని ఋణము మిగులుటచే నా ఋణతీర్మానము కొఱకయి, హరిశ్చంద్రుఁడు, చతుస్సముద్రముద్రితధారుణీవలయంబును బరిపాలించెడి చక్రవర్తి, కాటికాపరియగు వీరబాహునకు విక్రయింపఁబడి, నాఁటినుండి యా కాటిదాస్యమును జేయుచుండెను. విశ్వామిత్రుని విషమపరీక్షలందు దేవతలుఁగూడ తోడు నీడలైనటుల నటించి, హరిశ్చంద్రుని బూర్వవిఖ్యాతి నీమూలమున నినుమడింపఁజేసి వానికిని, విశేషించి లోకములకును దగిన గుణపాఠము నేర్పవలయునని యుద్దేశించినవారగుటఁజేసి యముండు తాత్కాలికముగఁ గాటిఱేఁడవతారముఁ దాల్చెను. ఆతఁడే వీరబాహుఁడు.

(6)

కుశికనందనుని ఋణము తీఱినంతమాత్రముచే హరిశ్చంద్రునకును, జంద్రమతికిని గష్టములంతమందలేదు. వీరితోఁ బాటు లోహితాస్యునకిడుములుతప్పలేదు. చంద్రమతీదేవితోఁ

గలిసి కాలకౌశికునియింట దాస్యవృత్తి గడుపుచున్న యీ బాలుండొకనాఁడు గృహయజమాని యానతిమేఱకు ఘోరారణ్యమునకుఁబోయి తోడిబాలురతోఁ బర్ణాదుల సేకరించుకొని రావలసియుండఁ, బాప మా బాలుఁడు వినయవిధేయతల నుగ్గుపాలఁ దాగిననాఁడే నేర్చుకొనినవాఁడగుటచే నటులనే యొనర్చుచుండెను. కౌశికునిసృష్టి విపరీతమైనది. ఆ మహారణ్యమున నొక గొప్ప మఱ్ఱిచెట్టు మొదలనుజేరి పర్ణములనేరుచున్న లోహితాస్యునిపాలిఁట నొక పెనుఁబాము దాఁపురమై వాని కాలు పీఁకుటచే నాకస్మికముగ నాతండు మృతిఁజెందెను.

తోడిబాలురఁగూడి యరణ్యమునకేగిన కుమారుండు చాలవఱకు రాకుంటచే చంద్రమతీదేవి హృదయమున దిగులనారాటముఁ జెంది, యబ్బాలురవలన నాఘోరవార్తనాలించి యెంతయో దుఃఖించి కుమారుని కళేబరమును జూచివచ్చుటకై యజమానురాలియాజ్ఞఁగోరెను. దయాదాక్షిణ్యరహితయగు కలహకంటకి యానాఁడు నిత్యకృత్యంబులకు రెట్టింపు పనులఁ గల్పించి, యెంతయో కాలహరణముఁజేసి యర్ధరాత్రమున కెట్టకేలకు సెలవొసంగెను.

పాప మా యువతీశిరోరత్న మా యర్ధరాత్రంబున నొంటరియై, యరణ్యమునఁజేరి యొకచోఁ గుమారుని కళేబరమునుగాంచి, భోరున నేడ్చియేడ్చి, తనకుఁదానే యోదార్చు

కొనవలయుఁగాన నాబిడయే కొంతవడికి ధైర్యముఁగొని, కర్తవ్యమూహించి కనినవారి విధియగుటచే దహనకృత్యమును నెఱవేర్ప నాశవమును భుజముపైవైచుకొని శ్మశానవాటికకుఁ గొనిపోయెను, తెల్లవాఱకమున్న మఱల దాస్యవృత్తికై యజమానురాలికడకుఁ జేరవలసి యుండుటచేఁ దన కృత్యమును సత్వరంబుగా నిర్వర్తించుకొనఁదలఁచి యాకళేబరము నొకచో దించి, వలయు సమిధల నేఱికొనివచ్చి చితిఁబేర్చి ముట్టింప సిద్ధపడియెను. పాప మాబిడ మిగుల శోకించుచునే యీకార్యములన్నియు నెఱవేర్చుచున్నందున నీ యార్తనాదమెట్టులనో యప్పటి కాటికాపరియగు హరిశ్చంద్రుఁ డాలించెను.

నియమిత కృత్యంబులం దేమాత్ర మేమఱుపాటుఁజెందని హరిశ్చంద్రుఁడు తోడనే యా కళేబరముకడకుఁజేరి యట ఘూల్లున నేడ్చుచుఁ జితి నంటింప నుద్యమించుచున్న చంద్రమతిని "అమ్మా! నీయూరుపేరులేమి? ఈగతించిన కుఱ్ఱండునీకేమి కాలయును? నీకుఁ జుట్టపక్కము లెవ్వరులేరా? నీయుదంతంబంతయు నెఱుంగఁ దెల్పు" మని ప్రశ్నించుచు మనంబున "అయ్యో! ఈమె యొకసాధ్విగాఁ గాన్పించెడిని. భగవంతుఁడు సదాచార సంపన్నులకే యిట్టి కష్టములఁజేకూర్చునే? ఇది వానిసహజకృత్యము కాఁబోలు! ఈకాంతామణి కంఠస్వరంబు ముందొకప్పుడు నేను వినినట్లుగనే యున్నదే!" యనిపరిపరి

తెఱంగుల భావించుచుఁ దనప్రశ్నమున కెట్టి సమాధానము రాఁగలదో యని నిరీక్షించెను.

ఆమెయు నీతం డెవ్వఁడో మహనీయుఁడని యే భావించినది. కరుణాళుం డనియే స్థిరపఱచుకొన్నది. తనకు దహనవిధియందుఁ దోడుపడఁగలఁడని యుద్దేశించినది "అనఘా! నాదీనచరిత్రి మును గూర్చి సవిస్తరముగా నీకుఁ దెలుపవలయుననినఁ జాల కాలము పట్టఁగలదు. ఈనాదేహ మొక్కని స్వాధీనమై యుంటచే నేనిట నాకాలమును వృథసేయఁజాలను. ఎందునకును గొఱ గాని యభాగ్యదేవతనని మాత్రము విన్నవించుకొనెదను. నా యవస్థల విలోకించుచున్న పంచభూతములే నాకన్నిఁటఁదోడు గాని యితరులతోడు లేదు. ఈ మృతిజెందినవాఁడు నాకుమా రుండు. యజమానుని యాజ్ఞ ననుసరించి యరణ్యమునకుఁ జని కుశాదుల సేకరించుచుండఁ బెనుఁబా మొక్కండు కఱచుటచే నీ తండు మృత్యువాతఁబడియె. మహానుభావా! నీ వెవ్వరవో యెఱిఁగింపు" మనె

హరిశ్చంద్రుండు "కాంతామణీ! నేనీవల్ల కాటికధికారిని. అంతకంటెఁ బ్రస్తుతమేమియు వచియింపఁ జాలను. నీవీచితిఁ బేర్చుటకు ముందు మాయాజ్ఞఁ బొందవలసియున్నది. అట్లుగాక స్వతంత్రించువారు శిక్షార్హులగుదురు. ఇచటకువచ్చి దహన విధి జరుపువారు పిండపుతండులంబును నొకమాడయు నర్పింప వలసియుందురు. మాకు రావలసినపన్ను నొసంగి యక్కార్యంబు

నెఱవేర్పు" మని కాటిచట్టముల నెఱింగించినంతఁ జంద్రమతీ దేవి చేతఁగాసు గవ్వలులేని తన యసమర్థత్వమును బ్రకటిం చుచు నెట్లయినఁ గరుణింపుమని వేడెను.

కాని కరుణించుట కాతఁడెట్లధికారి కాఁగలఁడు? అఖండ సామ్రాజ్యమును బరిపాలించు సార్వభౌముండు గాధేయుని భిక్షవలనఁ బరాత్పరుని విషపరీక్షలకు లోనయి యవ్విధంబునఁ గాటికాపరియై తనస్వామికార్యమును విధిగా నెఱవేర్చుచుండ స్వాతంత్ర్యమవలంబించినియమవిరుద్ధంబుఁగావింపజాలఁడయ్యె.

"ఒకవిప్రునియింటఁ జాకిరికత్తెనై పొట్టనేదో విధానఁ బోషించుకొనుచుశరీరమాత్ర విభవనై యున్న నేనీసుంక మేవిధిఁ జెల్లించుకొనఁగలుగుదును ? దయామయా ! జగం బున్నంతకాల మెవ్వరికేని దీనరక్షణము తప్పదుకదా ! తప్పఁ కాదు గదా ! సప్తాంభోధిపరీత భూవలయంబున నేకచ్ఛత్రాధి పత్యమువహించిన చక్రవర్తికిఁ దనయుఁడైనవీనికే వల్లకాటి యందు జేసెడు నేల కధికారము లేకపోయెనా ? " యని మొఱపెట్టెను.

ఆమె కష్టోదంతములనాలించుచున్న కొలఁదియు, హరిశ్చంద్రుని మనం బనేక విధంబులఁ బరువిడసాగెను. ఆయింతి తన యింతి యనియు, మృతినందినబాలుండు లోహితాస్యుఁడై యుండుననియు భ్రమించుచుండెను. కానితనమునోభిప్రాయమును

నెటుల స్పష్టపఱుపఁగలఁడు ? పాపము ! చంద్రమతియైనను, రూపరేఖావిలాసంబులు పూర్తిగా మాఱుటచే, మాసినగడ్డంబుతో, శుష్కించిన శరీరముతో, ధూళిఁగప్పిన తలతో, నెత్తుఁబాఱిన కనులతో, చినిఁగినప్రాఁతగుడ్డలతోఁ, గాన్పించెడివానిఁ దన పతిఁగా నెటుల గ్రహియింపఁగలదు ?

(7)

చంద్రమతీ దేవి దుఃఖాతిశయముచేఁ గనులవెంట ధారాపాతముగఁ గుఱియుచున్న నీటినిమాటిమాటికిఁ దనపయ్యెదతో నొత్తుకొనుచున్నందున నెటులఁ గాన్పడియెనో గాని యామె మాంగల్యము హరిశ్చంద్రుని కనులఁ బడియెను. "యువతీ ! నీగళంబునఁ దళ తళ కాంతు లీనెడు మాంగల్య మటులఁ గాన్పించుచుండ, శరీరమాత్రవిభవనని వచియింతువేల ? దాని విక్రయించి నీసుతుని దహనమునకు వెచ్చింపు"మని పలికిన హరిశ్చంద్రునిఁ జూచి పతివ్రతల మాంగల్య మన్యులకు గోచరముఁ గాకుంటచేఁ దప్పక నాతండు తన పతియేయని నిశ్చయించుకొని రయంబునఁ బతినిఁ గాఢాలింగనమొనర్చుకొనెను. ఆసమయంబున నాదంపతుల స్థితిగతు లెట్లుండునో యోచించుకొనుఁడు. ఒకరిచరిత్రముల నొకరు చెప్పుకొనుచుమృతిజెందిన కుమారుని జూచి రోదనంబొనర్చుచుఁ గొంతకాలము గడపిరి గాని యిరువురును బానిసలే యగుటచేఁ దమకృత్యంబులనిఁక

నిర్వర్తించుకొనకఁ దప్పదని హరిశ్చంద్రుండు కొంత ధైర్యమవ లంబించి "దేవీ! నిర్భాగ్యుఁడను. చండాల దాస్యంబునఁ బొట్ట బోసికొనుచుంటిని. కాటిచట్టము లందఱకెట్టివో స్వవిషయంబునఁ గూడనట్టివే. కాన నే నేవిధమగు సహాయముఁ జేయఁజాలను. మీా యజమానురాలి నడిగి యెట్లయిన నొక మూఁడ సంపా దించుకొనిరమ్ము. నాకు రావలసిన తండులంబులు వదలి కొందును. ఇదియే నేఁ జేయఁదగిన యుపకార"మని పలికి యెట్టులో తగినంత ధైర్యమును బూనుఁకొల్పి యాదేవిని బంపి తాను దన కుమారుని కళేబరమును దొడపైఁ జేర్చికొని జరి గిన విషయముల నెల్ల నొక్కటొకటిగాఁ దలంపునకుఁ దెచ్చు కొనుచు భోరున నేడ్చుచుండెను.

భర్తృనాజ్ఞ శిరసావహించి చంద్రమతీదేవిసుంకంబుఁ గొనివచ్చుటకై యజమానురాలి గృహంబున కరుగుచుండఁ ద్రోవమధ్యమునఁ గొందఱు రాజభటు లామెయందు దొంగ తనమొం డారోపణమొనర్చి రాజెదుటఁ బెట్ట, నాతండున్యాయ విచక్షణశూన్యుండై శిరచ్ఛేదనంబునకై యనుజ్ఞఁ నొసంగఁ దలవరు లామెఁగొని హరిశ్చంద్రునికడకుఁ దెచ్చి రాజాజ్ఞఁ దెల్పిరి. హరిశ్చంద్రుని హృదయంబు క్రొయ్యబాఱెనది. ఏమి చేయఁగలఁడు? భార్యనుగౌఁగిలించుకొనియెను. "హా! కాంతా! జగదేకపావనివి. నాపాలిఁటఁ గల్పలతవు. నీమూలమున మేమె ల్లఱముద్ధరింపఁబడితిమి. నాసత్యవ్రతంబును. రక్షించిన మాన

వతివి. స్త్రీజాతికెల్ల మకుటమవు. ఈయపనింద నాపరాత్ప రుండు నీకుఁ గూర్చుటలోఁ బ్రపంచమే లేదని తలంచెనా? తన ధర్మములనెల్ల విడనాడెనా?"యని ఘూల్లున నేడ్చెను. "మాన వతీశిరోమణీ! మనకర్మంబు లిటులుండ నాపరమేశ్వరుఁడేమి సేయఁగలఁడు? ధైర్యమ్ము వహించి గడచిన వన్నిఁటిమఱచి మనంబును స్వాధీన మొనర్చుకొని. కనులుమూసి యాభగ వంతుని గాఢముగా స్మరియించు కొ"మ్మని ధైర్యమ్ముఁ గఱపి తనదేవికంఠంబుఁ దెగవ్రేయ ఖడ్గంబు నెత్తుచుండ గాధినంద నుఁడు ప్రవేశించి తనపరీక్షలన్నియు ముగిసినవనియు, నింక నావధావిధానమాపున దనియుఁ బలికెనుగాని హరిశ్చంద్రుండు వినువకఁ దనకార్యమును సాధింపఁ దలంచెను.

(8)

విశ్వామిత్రుండును గత్యంతరము నెఱుంగక వారి వీరిని గేకలువేయ మొదలిడెను. ఇంతలోఁ బార్వతీసహితుఁడై పరమేశ్వరుఁడింద్రవసిష్ఠులతోఁ బ్రత్యక్షమై "హరిశ్చంద్రా! శాంతింపుము. నీసత్యవ్రత దీక్షకెంతయు మెచ్చితి. నిన్నివిధి గాఱియఁ బెట్టిన విశ్వామిత్రుఁడు శరణువేఁడుచున్నాఁడు. వసి ష్ఠాదులు నీమనోధైర్యమునకెంతయు హర్షించుచున్నారు. దేవేం ద్రాదులు నీదివ్యసుందర విగ్రహమును జూచిపో వచ్చినారు. శాంతింపు"మని యాజ్ఞనొసంగ హరిశ్చంద్రుండు ఖడ్గంబును

గ్రిందవిడచి ప్రాంజలిబద్ధుఁడై వచ్చినదేవతావర్గంబును ననేక విధంబుల స్తోత్రి మొనర్చి వారికరుణఁబడసి యనేకవరంబులంది మాఱలఁ దనవిభవంబులఁబడసి మహీతలంబునుజిరకాలమేలెను.

కష్టసుఖముల సమముగాఁ దలంచి, పతియొక్క సత్య వ్రత రక్షణార్థమై యిట్టి యవస్థల ననుభవించిన మహాసాధ్వి మహిమాంగనలలోఁ దొలిపేరుఁ జెందుట కెవ్వరాక్షేపింపఁ గలరు? ఆయమ్మ గుణముల నిత్యంబును స్మరియించు కొనుచు నాచరింపవలసిన విధు లెన్ని గలవు? గడింపవలసిన ఖ్యాతి యెంతకలదు?

---

# 2. దమయంతీ దేవి.



విదర్భదేశాధీశ్వరుఁడయిన భీమరాజు చిరకాల మన పత్యుఁడై దమనుఁడను సన్మునిని భార్యాసహితుఁడై యుపా సించి; వాని కరుణ నంది, దమయంతి యనెడి తనయను, దమ నాంతదమనులను పుత్త్రులఁ బడసి; యానందవారాన్నిధి నోలలాడుచుఁ దన సంతానమును నతి గారామున నోము చుండెను. అందు దమయంతి తన రూపరేఖావిలాసములచేతఁ; సుగుణములుచేతఁ; వినయసంపదచేతఁ దలిదండ్రులకు మఱింత

ముచ్చటఁ గలుగఁ జేయుచుండెను. భీమరాజు తన తనయకూ
డిగంబులొనర్ప సుర,సిద్ధ సాధ్య కన్యలనుమించెడిసౌందర్యముఁ
గల సఖుల నూర్వుర నియమించి యామె సుఖభోగంబుల కెట్టి
కొఱంత రాకుండునటులఁ గనిపెట్టుచుండెను.

జననీజనకులచే నత్యధిక ప్రేమంబునఁ బెంపఁబడుచున్నను
దమయంతి సుగుణములదొంతియగుటచేఁ దన శ్రద్ధాభక్తులను,
దన వినయవివేకమును వృధఁగానీకఁ దగిన యొజ్జలయొద్ద సకల
విద్యల సంగ్రహించి విజ్ఞానశీలయయ్యెను. ఆబిడ నేర్చిన విద్య
లలో, గృహకార్యనిర్వహణము; శిశుపోషణము, పాతివ్రత్య
లక్షణములు దైవభక్తి, సూనృత వచోనియమము, పరోపకార
చింతనము, అతిధియభ్యాగతాదరణము మున్నగునవి ప్రఖ్యాతి
వహించినవి. ఈ విషయము లామె హృదయమున శల్యగత
మొనర్చుకొని జీవితకాలమంతయు గడుపుటచేతనే యుగంబులు
గతించిన కొలఁదియు నామె కీర్తి లతలు వాడిపోవక శోభిల్లు
చున్నవి.

[2]

నలుండు వీరసేనసుతుండు. నిషధపురాధీశ్వరుండు.సౌంద
ర్యగుణ విశేషంబులచే రాణించువాఁడు. సక్రమ పరిపాలన
ముచేఁ బాలితుల మెప్పులనందెడివాఁడు. సత్యవాక్యపరిపాలనా
దక్షుండు, అనేకాక్షౌహిణీపతి. అనవరతాక్ష ప్రియుండు. వేదం

బులఁ బ్రమాణములుగాఁ గొని మెలంగును. రణవిద్యాకుశలుఁడ గుటచే నెల్ల రాజుల జయించి తన పరాక్రమముఁ జాటించెను. ఇట్టివీరుని గుణగణంబులఁ బలువురినోట విన్నదగుటచే దమయంతి యెట్లయిన నలుని భర్తగాఁ బడయవలయుననెడియాశఁ గలిగి యుండెను. నలుండును దమయంతి రూప, గుణ, యౌవనంబులఁ గూర్చి విన్నవాఁడగుటచే దమయంతినే తన ధర్మపత్నిగాఁ జేసికొన నుత్సహించుచుండెను.

ఒక్కనాఁడు నలుండు దమయంతి గుణగణంబులఁ దలంచుకొని యేమియుఁ దోఁచక నిరంతర విహారార్థోద్యానంబునఁ జేరి విహరించుచున్నంత నాకాశలక్ష్మి ధరించెడిముత్యాలదండల వరుసయోయనునట్లొప్పుచు హంసావళి యట నవతరింప వాని యందచందంబుల కెంతయు నలరి వాని నెట్టులేనిఁ బట్టవలయునని యత్నింప నొక్క హంస మాత్రము వాని చేతికిఁ జిక్కె. సాటి హంస నరవరు చేతికిఁజిక్కి తమ్మొడఁబాయుటచేఁ గలిగిన వియోగంబును సైపఁజాలక మిగత హంసలాకసంబున కెగిరియు నాతావుననే యఱచుచుండెను.

రాజుచేఁ బట్టువడిన యాహంస "యీ భూపాలుండు నన్నెఱగాఁ గొనునుగాఁబోలు" నని మనంబున దిగులంది దీనవదనంబున "నయ్యా! ధారుణీవల్లభా! నన్ను విడతువేని నీకుఁ బ్రియంబుఁ గూర్చెద. నీహృదయ ఫలకంబున నేకన్యచిత్తరు

వును లిఖియించుకొని చిత్తవిభ్రాంతుఁడవై మెలంగుచుంటివో ఆకన్యకడకే నిప్పుడనరిగి నీగుణగణంబుల నామెకు నూరిపోసి నీయందు బద్ధానురాగయగు నట్లొనర్చెద" నని విన్నవింప నలుండెంతయు సంతసించి యాహంసరాజమును విడిచిపుచ్చెను

ఆహంసయు నృపవరుండు చూపినకనికరంబున కెంతయు సంతసించి యంతరిక్షంబునఁ దనకై విచారపడుచున్న హంస పిండును గలిసి విదర్భకుఁజని యందొక్క యుపవనంబునవిడిసె. అటనే సఖీజన పరివృతయై దమయంతి యున్నది. కానియామె హృదయంబు నలునియందు లగ్నమయి యుండుటచేఁ జెలుల భాషణము లామెవీనుల కెక్కుటలేదు. ఆమెదృష్టి కన్యము గోచరించుటలేదు. చెలుల యుపచారములు రాణించుటలేదు. అట్లయ్యును వారితోఁ గలిసి మెలసి వర్తింపకున్న నన్యముగాఁ దలంచి పరిహాసము లొనర్తురని శంకించి వారితోఁబాటెట్టె దుట విడిసి నేత్రానందంబుఁ గొలుపుచున్న కలహంసలఁ బట్టు కొనెడివ్యాజంబునఁ బరువిడుచుండ నొక్కకలహంస యాబిడ కుఁజిక్కెను. ఆకలహంసయే నలునిచే విడువఁబడినది. దమ యంతీనలసంగమకారణదూతయైన యాకలహంస నలుని యెడఁ గృతజ్ఞతఁ జూపుకొనఁదలంచి తనసహజమృదుమధుర మంజుల వాక్యములతో "నింతీ! దమయంతీ! నారాక నీహృద యేశ్వరుండగు నలుని యొద్దనుండి. మహీతలంబందుఁగల రాజు లనందఱఁ జూచితిఁ గాని యాచక్రవర్తిసౌందర్యంబున కెన

యగు వారెందును గానఁబడరు. నీకెంతటి చక్కఁదనమున్నందులకు, నీవిన్ని విద్యల నార్జించి నందులకు: నీవు నలునిఁ జేఁబట్టఁ గలిగినచోఁ దగినఫల మనుభవింపఁగలవు. మీయిరువురిసమాగమంబన్యోన్యశోభాకరంబగు" నని పలుక నాదమయంతియు మెంతయు సంతసించి "యోపక్షిరాజమా! అధరాధవునిగుణంబుల నాకెఱింగించి నన్నట్టి తమకంబునకుఁ బాల్జేసితివో నాయెడఁగూడ నట్టులనే ప్రవర్తించి పుణ్యంబుఁ గట్టుకొ"మ్మని బ్రతిమాల నాహంస దమయంతి కడనుండి మఱల నిషధ కేగి యాకార్యమును నిర్వర్తించి యిరువురి యన్యోన్యాను రాగాభివృద్ధికిఁ గారణభూతురాలయ్యెను.

(3)

నలునిరూప, గుణయావనంబులఁగూర్చియనుదినంబును నిట్లాలించుటఁ జొక్కఁడై యన్యంబునుమఱచి యుంట దమయంతి హృదయంబును సఖీజనంబుగ్రహించి భీమరాజునకుఁ దెలిపిరి. అతండునుదనతనయకోరికఁదీర్చుటెట్టులనాయనిచింతించిస్వయంవరవ్యాజమున రాజన్యుల నెల్లరావింప నేర్పాటులొనర్చెను. స్వయంవర విషయంబును నెల్లనాలించి సైన్యసమేతులయి, విదర్భకుఁ జనిరి. పురాణ మునులగు పర్వత నారదులవలన దేవతలును, దమయంతిరూపరేఖావిలాసములను గూర్చియు, సుగుణసంపదను గూర్చియు, స్వయంవరప్రకటనమును గూర్చియు

నాలించి తదాలోకన కుతూహలంబున దివ్యవిమానారూఢులై తమ విమానంబుల నంతరిక్షంబున నిలిపి, భూతలంబునకువచ్చి, నలుని గనుంగొని సత్కారంబులఁ బడసి కుశలమారసి, దమ కేదియో కోరికయొండు కలదనియు, సద్దాని నెఱవేర్పవలయు ననియుఁ దెలిపి, వానివలన నట్లనే యొనర్చెదనని సమాధానంబుఁ బడసి, నలసార్వభౌమా! నీవిప్పు డమరదూతవై విదర్భకుంజని మా బలాధికార సంపద్విభవమ్ములఁగూర్చి దమయంతికి విన్నవించి మాలో నెవ్వరినైన వరించునటులఁ జేయు" మని పలుక నయ్యో! నే నేకార్థసమవేతుఁడనని యెఱింగి యుండియు మీరు నన్నీకార్యమునకుఁ బురిఁగొల్పఁదగునే? ఎట్టి కార్యమైన నొనర్ప సంసిద్ధుఁడనై యుంటినని యేల మాట నిచ్చితి. నాగతి యిప్పుడేమి కావలసియున్నది? నిత్యసత్యవ్రతుండనై యుండియు, నిప్పుడెట్లు తప్పుకొనఁగల్గుదు" నని మనంబున ననేక విధంబులఁ దర్కించుకొని, గత్యంతరముఁ గానఁజాలక నా దేవతలలో నింద్రుని దిక్కయి "దేవా! ఆయుధపాణులైన వీరభటులచేఁ గావలిఁ గాయఁబడుచుండు నంతఃపురంబున కేనెటులఁ జేరఁగల్గుదు? అందువఁ బ్రమాదంబు వాటిల్లదే" యన నింద్రుండు "రాజా! ఇదే తిరస్కరిణీఘుటిక. దీని శిరంబుపైధరించితివేని నీవన్యులకుఁ గన్పడవు. దమయంతినిలయంబుఁ బ్రవేశింప నీకు సుసాధ్యంబు.

క. దేవతల కప్రియంబులు
గావించు మనుష్యు లధమ గతులగుదురిలన్
గావున వారికినిష్టముఁ
గావింపుము నన్నుఁ బ్రీతిఁ గావుము తరుణీ!

అని మఱల హితంబుఁగఱపె అందులకు దమయంతి యేమియు శంకింపక "సార్వభౌమా! ఇంద్రాదులు మత్స్వయంవరంబునకు వచ్చెదరని గదా సెలవిచ్చితిరి. వారి సన్నిధానముననే మిమ్ము వరియించిన నెల్లరమును నిర్దోషుల మగుదుము. ఇదియనా నిశ్చితాభిప్రాయ"మని యొఱింగింవ నా మాటలనే నలుండు రయంబున నరిగి లోకపాలురకుఁ దెలిపి తన దూతకృత్యంబును నిర్వర్తించెను.

(4)

ఇంతలో దమయంతీ స్వయంవర దినమువచ్చినది. దేవేంద్రాది దిక్పాలుర పరీక్షయింకను ముగియలేదు. నాఁడీ నలువురును నలరూపంబుల ధరియించి వచ్చిరి. దమయంతి యీ సభయందుఁ గలరాజులలో నిజమగు నలుఁడెవ్వరో గుర్తింపఁ జాలక నాత్మయందు దేవతాస్తోత్రంబుఁ గావింప నాదేవత లనుగ్రహించి నిజ రూపంబుల ధరియించి నిలిచి దమయంతి దిక్కుఁజూచి "యోమానవతీ శిరోమణీ! నీచిత్తంబునుఁ శోధింపఁజేసి దెంచి యుత్తేజంగునఁ గావించితిమి.

కాని నిజముగా నిన్ను వరియించి వచ్చినవారముగాము. నీవు నోహాయుడగు నలుడితఁడేసుమీ" యని పలుకుచు నిజరూపునిఁ జూపించి పెండియు "నోతలోదరీ ! వీని వరియించి సకలశుభం బులఁ బడయుము. ఈతండు ధర్మాత్ముఁడు. సత్యసంధుఁడు. చక్రవర్తి. ఇట్టి సురూపుఁడు నీకుఁ దక్కుట నీపూర్వజన్మకృత విశేషం"బని వచియించిరి. దమయంతియు నాదేవతలు చూపిన దయకెంతయు నానందించి చేతనున్న మందారకుసుమమాలను నలుని గళంబున వైచెను. భీమరాజెంతయు సంతసించెను. దేవతావర్గంబంతయు నటనే గలరు. కాన నెవరికిఁ దోఁచిన వరం బుల వారు ప్రసాదించుటయేగాక విరివిగా నావధూవరులపైఁ బుష్పవర్షంబుఁ గురిపించిరి.

స్వయంవరానంతరము దేవతలు తమ లోకంబుల కరుగు చుండ ద్వాపర సహితుండై యెదురు వచ్చుచున్న కలిఁగని యింద్రుండు కలీ ! ఎటకరుగుచుంటి"వని ప్రశ్నింప "దమయంతీ స్వయంవరంబనివినియామెచే వరియింపఁబడెదమనెడియాశతోఁ బోవుచుంటి"నని కలిసమాధాన మొసంగ "నయ్యో! అంతయు మిగిలిపోయినది. నలునిఁ దక్క నన్యుని వరియింపనొల్లనని దమయంతి దృఢాభిప్రాయమై మమ్మెల్లఱఁ దిరస్కరించి యా నలునే సకల రాజ సమక్షంబున వరియించినది. నీపోకనిష్ప్ర యోజనం"బని శక్రుండు తెలిపిన,

గీ. కలియలిగి వైశ్యముగఁ జని ♦ నలుని విషప
రీక్షలన్ ముంపఁదల పోసి ♦ యక్షరతుఁడు
నలుఁడని యెఱింగి వానిలోఁ ♦ గలసి పుష్క
రేశుఁడాఁ గొల్వ నెంతయు ♦ హింసఁ బెట్ట.

అంతటితోఁ గలి యూరకుండ లేదు. తోడనున్న ద్వాపరంబును గొన్ని కార్యంబులకు నియోగించి నలుని వేధింపఁ జేసెను. పుష్కరుండు కలిప్రేరితుఁడై విప్రవేషంబున నున్న కలిని వెంటఁగొని నలుని చెంత కరిగి ద్యూతార్థమాహ్వానింప నలుండు వారికోరికను దిరస్కరింపఁజాలక జూదమాడుట కుపక్రమించి కలధనము నెల్ల నొడ్డెను. వివిధ వస్తు వాహన నివహంబుల నొడ్డెను. కలిసమావేశ పరవశుండైన నలుని మంత్రులుమున్నగు పరిజనులందఱును నివారింపఁజూచిరి గాని వారి ప్రయత్నములు నిష్ఫలములైనవి. దమయంతి యీ పరిస్థితుల నెల్ల గనులారఁ దిలకించుచు నిఁక బ్రయోజనము లేదనియుఁ దమకెట్టి గతి సంప్రాప్తము కానున్నదో యనియు నెంతయుఁజింతించి వార్ష్ణేయుఁడను సారథిని రావించి "వార్ష్ణేయా! స్థితిగతులు మాఱుచున్నవి. మాదారియేమి కాకున్నదో! నా కుమారుండగు నింద్రసేనుని, గుమార్తె యగు నింద్రసేనను రథంబుపై నిడికొనిపోయి విదర్భయందుఁ గలమద్బంధువులకడడించి రమ్మని పంపె.

(5)

పాపము ! దమయంతి యనుకొన్నట్టులనే జరిగినది. నలుండు దమయంతీద్వితీయుఁడై వనంబుల కరుగవలసి వచ్చెను. నలుండు తన దురవస్థయందుఁ బాల్గొన సంసిద్ధయైయున్న దమయంతి నెట్లయినఁ బుట్టినింటికిఁ బంప యత్నించెను గాని యామె యందుల కియ్య కొనకుండుటను నలునకు దమయంతిని వెంటఁ గొనిపోకుండుటకు వలనుపడ లేదు. నలుండు దమయంతీసహితుఁడై యొక యరణ్యమునఁ జేరి యందు వసించెఁ గాని తన భార్యయొక్క యవస్థనుజూడఁ జాలకుండెను. తమ యాఁకలిని దీర్ప శక్తిలేకుండెను. ఆకలి దప్పులఁ దీర్చుకొనలేక పాప మాయిల్లాలితో నలుండా ఘోరారణ్యమున నెన్నాళ్లు గడుపఁగలఁడు ? రెండుమూఁడు దినములిట్టుల జరిగినపిమ్మట నా కుటుంగట నేగల యొక చెట్టుపైఁ గొన్ని పక్షులు జేరి విలాసముగఁ గాలంబుఁ గడుపుచుండ నా పక్షులఁబట్ట నుంకించి నలుండు పైనున్న వలువ నెగుర వేయ నా పక్షు లాపుట్టంబుఁగొని యంతరిక్షంబున కెగసి యటనుండి విగతవస్త్రుండైన నలునిదిక్కుఁజూచి నవ్వుచు, "రాజా ! మమ్ముఁ బక్షులుగా భ్రమింతువేమో ! నీ రాజ్యసర్వస్వంబును, నీధనంబును జూఱఁగొనిన యక్షములము. మమ్ము భక్షింపవలెననెడి యాశ నీ కేటి" కని పలుకుచు నత్తలంబు వాసెను. తనకు వాటిల్లిన యీ దురవస్థ కెంతయు దుఃఖించి దమయంతికట్టిన

పుట్టంబుచెఱఁగు గట్టుకొని యేకవస్త్రులై యున్న సమయంబున నలుండు "దమయంతీ! ఇయ్యరణ్యంబునఁ బెక్కుమార్గంబులు గాన్పించుచున్నయవి. ఇందొకటి దక్షిణాపథంబు. మఱియొకటి విదర్భకరుగును. ఇంకొకండు కోసలంబునకని దోఁచుచున్నది. నాలుగవది యుజ్జయనికై యుండును: కోమలీ! ఈ దుర్గాటవిలోఁ గ్రూరమృగగర్జనము లాలించుచు, నుపవాసములచేఁ గృశించుచుఁ, బదములకు గ్రుచ్చుకొనెడి కంటకములచేఁ గుంటుకొనుచు, నెంతకాల మోపికఁ బట్టఁగలవు? వలదనిన విన వైతివి. ఇప్పుడైననేమి? నీ బంధువులకడకరిగి సుఖియింపు" మని తెలుప దమయంతి "నాథా! మీమాట నేనేలఁ గాదనవలయు నిరువురముఁ బోయి సుఖియింపనగును. రం" డని యర్థించె. ఆమెకోరిక నలునకు రుచియింపలేదు. "దేవీ! అధికైశ్వర్యయుతుండనై యింతటిదనుక సకల బంధువులముందు సంచరించిన నేను, సర్వహీనుండనై వారియెదుట మనఁగలనా" యని తిఱుగఁబలుక సాధ్వీమణిగాన; భార్యయనెడి రెండక్షురములందెట్టి మహత్తరశక్తిగలదో బాగుగా నెఱింగినదేగానఁ, బతితోడిదియే సతులకు లోకంబని విశ్వసించినదిగాన;

గీ. అఖిల దుఃఖ రోగార్తున ♦ కౌషధంబు
సురుచిరంబుగ భార్యయ ♦ చూవె యెందు
నొనర భార్యాసమేతుఁడై ♦ యున్నవాని
కెంత లాపదలయ్యున ♦ నెఱుకపడవు.

క. అలయునెడ, డయ్యునెడ, నాఁ
కలియుఁ దృషయునైనయెడలఁ ♦ గనుఁగొని ధరణీ
తలనాథ! పురుషునకు ని
మ్ముల భార్యయపాచుఁ జిత్త ♦ మున దుఃఖంబుల్.

నాధా! నేను నీయర్ధాంగలక్ష్మిని. నీదయకుఁ బాత్రు రాలను. కష్టసుఖములకు భేదవృత్తిఁ గల్పింపక సదా నిన్నను సరించుదానను. నేనిట్టిదానననియెడి నమ్మకముఁగలదేనివెంటఁ గొనిపొండు. మిమ్ముల విడచి నన్నొంటరిగఁ బుట్టింటి కరుగు మనుట భావ్యంబు కా"దని వినయంబున వాకొన నలుండు భార్యను వెంటనిడికొనిపోవుటయే యుత్తమంబని నిశ్చయించి యటఁ గాన్పించుచున్న త్రోవలలో నొకత్రోవ ననుసరించి పోయి విజనంబైన విపినంబొక్కండుఁగని యందొక్కమందిరం బుంట నవలోకించి యందువిశ్రమించె. పాపము! దమయంతి దారిబడలికచే సొక్కి గాఢనిద్రాపరవశురాలయ్యెను. నలునకు మాత్రమునిద్రరాలేదు. "అయ్యో' మాయాజూదమునఁ బ్రవే శించి, రాజ్యంబును, ధనంబును గోల్పోయి, యాప్తవర్గంబు నకు దూరమై పత్నీసహితుఁడనై యీదుర్గమారణ్యంబునకుఁ జేరి యిడుములందుటేమి" యని శోకించుచు నా శోకమును మఱల్చుకొనఁజాలక; దమయంతిదిక్కయి "హా! ప్రాణసతీ! దాసీజనంబడుగులొత్తుచుండఁగమృదుశయ్యాతలంబునహాయిగా నిద్రఁజెందు నీవీదుమ్ముతో నిండిన స్థలంబున నిద్రింపఁ దలఁ

చుట నాకుభార్యవగుటఁ జేసిగదా! నీ వింకొకనిఁజేఁబట్టి యున్నచో నిట్టికష్టముల ననుభవింతువే! నేను నీదుఃఖమును జూడఁజాలఁ జూడఁజాల"నని మఱింత యేడ్చి యాబిడ నిద్ర లేవకమున్నె యెటకేనిఁ బోయినఁ దన్ను గానక నేబంధువుల యొద్దకేనిఁ బోయి సుఖపడఁగల దని నిశ్చయించి యామెకట్టు పుట్టంబునందు సగంబు చించి ధరించి, యాతలోదరి యెడఁగల ప్రేమంబును బాయలేక నెట్టులనో తెంపుఁజేసుకొని వెడలి పోయెను.

(6)

కొంతసేపటికి దమయంతి మేల్కొని తనప్రాణపతి లేమిఁ జేసి నలుదిక్కులఁ బరికించి తన్ను విడిచి యెటకోపోయెనని నిశ్చయించుకొని భయశోకవ్యాకులచిత్తయై నలునుద్దేశించి "హా! హృదయేశ్వరా! నిషిధరాజాగ్రణీ! మహామహీరక్షణం బొనర్చితివి. పాలితుల నుతులందితివి. సకల ధర్మంబుల నెఱిం గితివి. సుగుణాన్వితుఁడవనెడి కీర్తిఁ బొందితివి. "ఓయింతీ ! నీవు నా ప్రాణసమానమవు. నిన్నెట్టి సమయమునందైనను విడువ నని పలికితివి. సత్యప్రతిపాలనంబున నీయంతటివాఁడు లేఁడనియనిపించుకొని నీధర్మపత్నినగు నన్నిట్టులొంటిగా విడచి పోవుట ధర్మమని యెంచితివా? చతుర్వేదములు నొక్క సత్య వాక్యమునకీడురాఁ జాలవనెడి యార్యుల వచనంబుల మఱచి తివా? నీవిట్టినిర్దయుఁడ వగుదువనికలలోనైనఁ దలంపనైతినే?

నీవిట్టి యకార్యమున కొడిఁగట్టుకొందువని యేమాత్రము గ్రహియింపఁ జాలిననునే నీపాడు నిద్రకుఁ బొల్పడుదునా? పంచభూతములుసాక్షులుగాఁగొనినన్నునీధర్మపత్నిఁగాఁగ్రహియించిన దిందుల కేయనుకొంటివి కాఁబోలు. మహారాజా! నామూలమున నీకెట్టి కష్టములు సంప్రాప్తములైనవి? అయ్యో! మహారాజ నకునీకు నాచీఱ చెఱఁగుకట్టుబట్ట యైనదా! హా! మనోహరా! ఎందున్నావని వెదకుదు? నీ సుందరవదనారవింద సందర్శన మహాభాగ్యము మఱల నాకెట్లు లభియించు"నని యదేపని గావిలపించుచు నలునన్వేషించుచు నందుండి బయలుదేరెను.

నలుండు దమయంతి నొంటిగా విడిచిపోయెనేగాని వానికిఁ గాళ్లాడలేదు. తానొనర్చిన సాహసకృత్యము ధర్మబద్ధమని తోఁచలేదు. కొంతదూర మరుగుసరికి దమయంతి నటులంజేయుట మహాపాతకమని నిశ్చయించుకొని మఱల నెటులైన దమయంతిని గలిసికొన నుద్యమించి యామెనెట విడిచివచ్చెనో యాతలంబున కరిగెను. అట దమయంతి లేదు కాని,

చ. అవిరళ విస్ఫులింగనివ ♦
హంబుల నభ్రపథంబునంటుచున్
దవదహనంబు ద్రుగతరు ♦
దాహముసేయుచునున్నఁ జూచి మా

నవపతిదాని యంతరము ♦
నన్వినియెన్ "నరనాథ! నన్నుగా
రవమున వేగకావనిట ♦
ర"మ్మను వార్త మహానినాదమున్.

అందులకు నలుండీపుణ్యాత్రమేని శంకింపక నాదవానల-మధ్యంబునఁజొచ్చి చుట్టఁ జుట్టుకొని దీనవదనంబున నున్న యొక్క నాగకుమారుఁ గనినంత నానాగకుమారుండు కృతాంజలియై "యార్యా! నే నొక్క బ్రహ్మఋషి శాపంబున నిట్లయితి. కదల మెదలలేకుంటి. మీఁదుమిక్కిలి నీ దవానలంబునఁ జిక్కితి. నన్నుఁ గరుణించి యొక్క చెఱువుగట్టునఁ జేర్పు"మని మొఱపెట్ట నాతండు దయఁదలఁచి యా కర్కోటకు నెత్తికొని పోవుచుండ నప్పాము వానిఁ గఱచె. నలునకు వికృతరూపంబువచ్చె. తనరూపం బటుల మాఱినందులకు నలుండెంతయు నంతరంగమునఁ బొక్కుచుండఁ గర్కోటకుం డాత్మరూపంబున "నయ్యా! నీవుదుఃఖింపకుము. కర్మానుభవం బేలికినిఁదప్పదు. నేఁ గలిప్రేరితుండ. శచీధవునియనుగ్రహమున నావిషంబమృత తుల్యం బగుట నీకుఁ బ్రాణహాని కలుగదు. ఈ రూపంబుచే నీ కాకలిదప్పులు హస్తగతములై యుండును. వలసినవేళ నన్ను స్మరింతువేని నీవు నీ యథారూపంబుఁ బొందఁగల్గుదువు. నావిషంబు నీశరీరంబునఁ బ్రవహించునంతఁదనుక నీ కెట్టి భయంబుఁ గలుగదు. నీకనతి-

కాలముననే నీరాజ్యవిభవంబును, భార్యాప్రాప్తియుఁ జేకూఱుఁ గల"వని వరం బొసంగుటయేగాక "రాజా! ఇక్ష్వాకుకుల ప్రసిద్ధుఁడగు ఋతుపర్ణుని కడకఱుగుము. ఆతండునీకు బాసట కాఁగలండు. బాహుక నామంబుతో వానికి సేవకుఁడవై వర్తించిన నీకు సకలశుభంబులు సమకూఱుఁగల" వని హితం బొసంగి తిరోహితుఁడయ్యెను. నలుండు కర్కోటకుని హితంబు ననుసరించి యయోధ్యా నగరంబుఁజేరి ఋతుపర్ణునిఁగలిసి తన స్థితిఁగతుల నివేదింప నాతండెంతయు సంతసించి.

క. నాయొద్దనుండెదేని మ
దీయ రథాశ్వముల గమన ♦ ధృతి శీఘ్రముగాఁ
జేయుమునావుడు నట్లుఁ
జేయుదునని నలుఁడు వాని ♦ సేవించెమదిన్.

(7)

దమయంతి కెందును నలుని జాడ తెలియదయ్యెను. పులులయెలుఁగులకులుకుచుండెను. ఎండ వేడిమి భరింపఁజాలక వృక్షచ్ఛాయల నిలుచుచుండెను. వెదకిన తావులనే మఱల మఱల వెదకుచుండెను. ఇట్టి విపరీత కష్టముల సహించుచు నాయరణ్య ప్రాంతములనే సంచరించుచున్న దమయంతినొక్క పన్నగంబు పట్టుకొననార్తయై విలపించుచుండె. ఈనాదమాలిం చిన యొక బోయతేఁడు బిరాన నటకుఁ బరువెత్తుకొని వచ్చి

యామెను గవయనుంకింప నాతలోదరి గత్యంతరమునూ గానక
"నేనుబతివ్రతనైతినేని యీదురాత్ముం డిందు దగ్ధుండగుఁగాక"
యని శపించిన నాకిరాతుండా తత్క్షణంబున నేవిగతజీవుండయ్యె.

అంత నాయరణ్యమును దాఁటి దమయంతి యొక ముని
పల్లెఁజేరి యందున్న మహర్షులఁ దిలకించి వారికిఁ దననిజచరిత్ర
నెఱింగింప వారు తమ దివ్యదృష్టివలన సకలమ్ము నెఱింగి
"అమ్మా! కతిపయదినంబులలో నీవు నీపతిని గనుఁగొనగలవు
విచారమువలదు. పోయిర"మ్మని వచియించి యటనే యదృ
శ్యులైరి. ఆవింత ప్రదర్శనమునకు దమయంతియెంతయు నాశ్చ
ర్యమంది ముందునకు నడుచుచు నొకబిడారుఁగనె. ఆ జనం
బీపెను జూచి నానావిధములుగ భయంబంది దమయంతిని
"నీవెవ్వర" వని ప్రశ్నింప నామె తన నిజోదంతమెఱింగించి
నలునిగూర్చి ప్రశ్నించెను.

నలునిజాడ మాకేమియుఁ దెలియ" దని సమాధాన
మిడిరి. పదఁపడి దమయంతి యాత్రోవనుగూర్చి ప్రశ్నించి
వారలఁ గలిసి చేదిపురంబునకుఁ జేరి జనసంకులంబగు రాజ
మార్గంబునఁ బోవుచుండ రాజమాత దవ్వునఁజూచి తనదాది
నంపి తన యొద్దకు రప్పించి, వృత్తాంతమంతయు నారసి, కరు
ణించి యామెకట నిలువనీడ నొసంగెను. తదాది దమయంతి
సైరంధ్రీవ్రతంబున నటఁగాలంబుఁ గడుపుచుండెను.

(8)

సార్వభౌముండగు నలుండు రాజ్య సర్వస్వమును గోలుపోయి దమయంతీ ద్వితీయుఁడై మహారణ్యములకరిగిన వార్తనాలించిన నాఁటనుండియు విదర్భపురాధీశ్వరుండగు భీమరాజు పరిజనుల నలుదిక్కులకుఁ బంపి వెదకించుచునే యుండెను. అటుల వెదకుచున్నవారిలో సుదేవుం డొకఁడు. ఈతఁడు భీమరాజు పురోహితుఁడు. సుదేవుం డెట్టులెటులోఁ జేదిపురంబునకుఁ జేరి దమయంతివృత్తాంత మెఱింగి మహదానందభరితుఁడై యామెను విదర్భకుఁజేర్చి మఱల నలునిజాడ లరయుటకై బయలుదేరి, ఋతుపర్ణుని యాస్థానమునఁజేరి వికృతరూపధారియై సేవకత్వమును గడుపుచున్న బాహుకునిఁజూచి యనుమానించి, వాని సంభాషణములఁబట్టి నలునిగా నిశ్చయించుకొని, యెవ్విధినైన నాతని విదర్భకురప్పింపఁదలఁచి నలునిబలుకరింపకయే విదర్భకరిగి తన ఱేనికి నలునియునికి నెఱింగించె.

అంత భీమరాజు నలుని రప్పించు విషయమున మంత్రిపురోహితాది పరిజనంబుతో దీర్ఘాలోచనమొనర్చి దమయంతీద్వితీయ స్వయంవరంబను వ్యాజంబొండుఁ గల్పించి, ఋతుపర్ణున కొక శుభలేఖ వ్రాయించి సుదేవునే మఱలఁ జేదిపురంబునకంపెను. ఋతుపర్ణుండు సుదేవుండు తెచ్చిన పత్రికను జూచి బాహుకుని రప్పించి చదువ నొసంగెను. బాహుకుని యప్పటియునికి వర్ణనాతీతము. దమయంతికిని, దనకును గల

ప్రేమానురాగములఁ దలంచుకొని విలపించెను. దమయంతి నిట్టి దుష్కార్యమున కొప్పుకొనినందుల కెంతయు నిందించెను. ఇయ్యది నిజమైన వార్తయైయుండునా యని సంశయించెను. తనయంతవానికిట్టి యపనింద రానగునా యని లజ్జించెను. వివిధగతులనున్న తన భావముల నేవిధంబుగను మార్చుకొన శక్తిహీనుఁ డయ్యెను.

(9)

సుదేవుండు కొనివచ్చిన లేఖావృత్తాంతము వాస్తవమైనదనెడి ధృఢవిశ్వాసముతో ఋతుపర్ణుండు బాహుకుని సారథిగాఁగొని దివ్యరథం బొండధిరోహించి విదర్భకుంజేరెను. దమయంతీ ద్వితీయ స్వయంవర ప్రకటనము వాస్తవమైనదైనచో నెందఱెందఱో భూపాలురీసరికి రాజమందిర మలంకరించెడివారో, లేక భీమరాజు సాహసమునకుఁ బలుతెఱంగుల నిందించెడివారో, కాని ప్రచ్ఛన్నవేషధరుండగు నలుని విదర్భకుఁ జేర్చుటకై పన్నిన పన్నాగమగుటచే నందు రాజులెవ్వరును లేరు. పురాలంకారము లేదు. భేరీమృదంగాదివాద్యంబులు లేవు. ఋతుపర్ణున కనుమానముదయించియందునఁగూర్చి భీమరాజునడుగ నాతండు నిజోదంతమంతయు నెఱిఁగించెను. సుదేవుండు బాహుకునికడకేగి "మహారాజా! వీరసేనకుమారా! బాహుకనామమున నీ నరపాలుని సేవించుచున్న నీకు సకల శుభంబులుఁ జేకూఱుఁ గాక" యని ఫలాక్షతలీయఁబోవ

బాహుకుండు తన్నుఁ బరిహాసించుటకై సుదేవుం డటులఁ బలుకుచుండెనని భ్రమించి తిరస్కరింప సుదేవుఁడు తాను చేది పురంబున గుర్తించిన విధానమెల్ల స్పష్టపఱచెను. దమయంతియు నలుండు ప్రచ్ఛన్న వేషంబున నున్నను నన్యునిగాఁ దలఁపక నెయ్యమునను, లజ్జను, భయసంభ్రమమునను, వివశాత్మ యగుచుఁ జేరువకుఁ జని "నాథా! మిమ్మిటకుఁ జేర్చుటకుఁ బన్నిన యీవిధానమును మీరన్యముగా భావించి, త్రికరణ శుద్ధిగా మీచరణ కమలముల నమ్మికొని జీవించు నన్నుఁ గటాక్షింపవేని యిప్పుడు నీచరణ సన్నిధినే ప్రాణంబులఁ ద్యజియించెద"నని ప్రార్థించెను. భీమరాజు "రాజకంఠీరవా! నేఁగావించిన కృత్యంబు నీచంబైనదయ్యు క్షమాపణార్హమైనది. ఎట్లంటివేని,

క. నరవరుఁడు నలుఁడు కాకె
వ్వరు శతయోజనము లొక్క ♦ వాసరమున వ
త్తురు నరులొరులని దీనిం
బరికింపఁగ వేఁడి యిట్లు ♦ పంచితినధిపా.

ఉ. ఏనొక పాపభావమును ♦ నెద్దఁ దలంపఁ దలంపకొందుగా
నానలవైరి! నీయడుగు ♦ లంటఁగ నోఁపుదునట్లయైన న
న్నీనలినాప్తుఁ డీయనలుఁ♦ డీమృగలాంఛనుఁడీసురోత్తముల్
జాను వడంగ నాక్షణమ ♦ చంపరె కోపపరీతచిత్తులై

అని పలుకుచు మున్ను వార్ష్ణేయునిఁ దోడుగాఁ జేసి తనకడ కంపిన యింద్రసేనుని, యింద్రసేనను రప్పించి "నృపకులతిలకా! వీరు నీసంతానము. వీరిఁజూచియైనమమ్మనుగ్రహింపవలయు" నన బాహుకరూపధరుండగు నలుండు కర్కోటకుని స్మరియించి నిజరూపంబంది యాలుబిడ్డల గ్రహించి యెల్లఱ నానందవారాన్నిధి నోలలాడఁ జేసెను. ఋతుపర్ణుఁడు సార్వభౌమునంతటివానిఁ దన కడ సేవకునిఁగా నియమించుకొనినందులకు క్షమింపవేఁడెను. ఆపత్కాలమున శరణమిచ్చి రక్షించిన ఋతుపర్ణుని నలుండును నెంతయో కొనియాడి తన కృతజ్ఞతను జాటి యందఱకును బునస్సమాగమ మహాభాగ్యముఁ గలుగఁ జేసిన సుదేవున కనేక నతులొసర్చి పుత్ర, మిత్ర, కళత్ర బాంధవ పరివారసహితుఁడై నిషిధకుఁ జేరి యింద్రసేనుని యువరాజుఁ జేసి కలిచేఁ బ్రేరేపింపఁ బడి యనేక దుష్కార్యముల కొడిఁగట్టి జనకంటకుఁడైన పుష్కరుండా నగరవాసులచే బంధింపఁబడుటచే వాని విముక్తుఁ జేసి వెంట వచ్చినవారి నెల్లఱ సకల రీతుల సన్మానించి వీడ్కొల్పి ధర్మపథగామియై ధరావలయంబుఁ బరిపాలించెను.

నలునిఁ జేఁబట్టినదాది యెట్టియిక్కటులు వాటిల్లినను మిగుల నోర్పువహించిన దమయంతి; భీకరారణ్యమున నలుఁడొంటిగా విడిచిపోయినను దుర్భర దురంతకష్టముల సహించి భర్తనన్వే

పించుచుఁ దన్నొక్క కిరాతకుం డడ్డగించినను పాతివ్రత్యము నిల్పికొని లోకమున కొక గుణపాఠము నేర్పిన దమయంతి, తన దివ్యచారిత్రమును బ్రతిమానవునిచే నెటులఁ బఠింపఁజేసి కొనినదో చూడుఁడు.

---

# 3. సావిత్రీదేవి.

మద్రదేశాధీశ్వరుండగు అశ్వపతి పరమధార్మికుఁడై, సత్యసంధుఁడై, ప్రజానురంజకుఁడై, సర్వభూతహితరతుండై, ధరాపాలనముఁ జేయుచుండెను. కాని సంతానము లేమిఁజేసి చాలకాలము చింతచేఁ గృశించి మహనీయుల సలహా ననుసరించి సావిత్రీదేవినిగూర్చి వరుసఁగాఁ బదునెనిమిదిసవత్సరంబులు మహాతపంబొనర్చి, యామె కృపచేఁ గొన్నాళ్ళకొక కూఁతుఁ బడసెను. పున్నరకంబుఁ దొలగించుకొనుటకై పుత్రునిఁబడయ నశ్వపతి తపంబొనర్పఁ గలిగిన ఫలిత మిది.

సావిత్రీదేవి సాక్షాత్కరించి నీ కొక కూఁతురుఁ బ్రసాదించెదనని వాక్రుచ్చినపుడే యశ్వపతి తనకుఁ గూఁతురు వలదనియు, నాఁడుసంతానము శాశ్వతదుఃఖమూలమనియు గోలుఁ బెట్టెను. కాని యవ్వ్యాది బ్రహ్మనియమమ మఱియు, వానిఁ

మారియోగములు దాటు టశక్యమనియు నైనను నాఁడుసంతా
నమువలన వంశమునకు గౌరవముఁ జేకూఱఁగలదనియు ననేక
విధంబుల హితంబుఁగఱపి యశ్వపతిని సంతృప్తుఁ గావించెను.

అశ్వపతి సావిత్రిదేవి యనుగ్రహంబుఁ బడసిన కొలఁది
కాలముననకే వాని భార్యయైన మాళవి గర్భంబు ధరియించి
యొక పుణ్యదివసంబున నొక పుత్రికను బ్రసవించెను. దేవీవర
ప్రసాదజనిత యగుటచే నశ్వపతి జాతకర్మ, నామకరణాదుల
మిగుల వైభవంబుతోఁ గావించి, సావిత్రిదేవి యనుగ్రహిం
చిన శిశువగుటఁ దన నందనకు సావిత్రి యను పేరు పెట్టు
కొనెను. తలిదండ్రుల గారాబముతో, దాదుల యుపచారము
లతో, శుక్లపక్ష శశాంకుని కరణి దినదినాభివృద్ధిఁ జెందుచుఁ
గ్రమముగా యౌవనదశకు వచ్చెను.

ఆ కాలమునకు సావిత్రిరూపమున కెనయగు వారెవ్వ
నును లేకుండిరి. ఆమె తేజమునుగూర్చి వర్ణింపఁగల పండితులు
లేకుండిరి. సాహసించి, యామెయెదుట నిలఁబడి కరగ్రహణ
మొనర్పఁగల రాజులు లేకుండిరి. ఇట్టి రూపవతిని, గుణవతిని,
గుమార్తెగాఁ బడసిన తలిదండ్రులతి ధన్యులు గదాయని
ముక్కుమీఁద వ్రేలుంచుకొననివారే లేరు.

వివాహముఁ జేయవలసినయీడు వచ్చినవెనుక నాఁడు
పిల్ల నింతకాలమని యొరులచేతఁ బెట్టక తలిదండ్రు లూరు

కొనఁగలరు ? పాప మశ్వపతి యాకన్యకుఁ దగిన వరుని సంపా దింపవలసియున్నది. నానాదేశాధీశ్వరుల నశ్వపతి ప్రశ్నించి చూచెను గాని ప్రతివారును మా తనయుండు మీ యమ్మా యినిఁ జెట్టబట్ట నర్హుఁడా యని సందియంబందినవారే. సాహ సించినవా రెందును గానరానందున, సుగుణవతి యనేడి విఖ్యాతి నందిన తనయయందే వరాన్వేషణభారమును నిల్పి, యావశ్యకమైన బలగం బొసంగి దేశాటన మంపెను.

(2)

సావిత్రియు జనకునియాజ్ఞ శిరసావహించి దేశాటన మొనర్చుచు నొక్కచోఁ దగిన వరుని వెదకికొని కొన్నాళ్ళ కింటికిఁ జేరెను. సరిగా నాసమయమునకే యశ్వపతి నారదు నితోసంభాషించుచుండెను. ఆసంభాషణ మామెవివాహామును గూర్చియే యగుటఁజేసి తనయనురావించి "అమ్మా! నీవు వెడలిన కార్యముయొక్క ఫలితమేమి" యని ప్రశ్నించెను. "తండ్రి ! ఒక దుర్గాటవియందొకరాజు భార్యాపుత్రులఁ గలసి తపం బొనర్చుచున్నాఁడు. ఆతండు పూర్వభవసంచితముచే నంధుండయ్యెను. వానివృత్తాంత మిది. ఆతండు సాళ్వదేశాధి పతి. క్షత్రియకులోద్భవుండు.పరమధార్మికుఁడు.సత్యవ్రతదీక్షా పరాయణుండు. ఆతండంధుఁడగునాఁటికిఁ గొమరుండు పసిగ్రు డ్డగుటఁ బూర్వవైరులు నిష్కారణముగ నాతని రాజ్యమాక్ర మించుటచే నరణ్యము పాల్గావలసివచ్చెను. వానికొమరుండు

రాచనగరునఁ బుట్టి మహారణ్యమునఁ బెరిఁగినను, రూప,గుణ సౌశీల్యములయెడ నెట్టికొఱంతయుఁ జెందకుంటచే నే నాతని నాపతిగా వరియించితి" నని సావిత్రి తన తండ్రిప్రశ్నంబునకు సమాధాన మొసంగెను.

నారదుండు సామాన్యుండు కాఁడు. త్రిలోకసంచారి యగుట నాతఁడు చూడనిప్రదేశము లేదు. త్రికాలవేదియగుట నాతం డెఱుంగని యంశమును లేదు. కలహాభోజనుండగుట నాతండు కారకుఁడుగాని కలహంబు లేదు. లోకమునకు నూతనములగు గుణపాఠముల నేర్పుటకే యేవేళల నెట్టివింతనాటకములఁ బ్రదర్శింపఁ జేయవలయునో, యందున కెట్టివారలు పాత్రధారులైనఁ గధావిధానము సకలలోకరంజకముగా నుండునో బాగుగా నెఱింగినవాఁడు. తెలివిమాలినవారు మాత్రి మాతనిచర్యల విపరీతముగా నిరసించుచుందురు.

సావిత్రి పలికినపలుకుల నాలించినతోడనే నారదుండు చెవులమూసికొని "హరిహరీ: పాపము శమించుఁగాక" యని పలికెను. అశ్వపతి కాచర్య మెంతయు విపరీతముగాఁ దోఁచి "మునీంద్రా ! మీ రట్లనఁ గారణమేమి" యని ప్రశ్నించెను. "నృపాలోత్తమా. వాని వృత్తాంత మంతయు నే నెఱుంగుదును. వానిపేరు సత్యవంతుఁ డందురు. చిత్రాశ్వుఁ డనికూడ పిలుచుచుందురు. ఆతండు రణశూరుఁడే, బుద్ధిమంతుఁడే, రూపవం

తుఁడే,పితృవాక్యపరిపాలనా బద్ధకంకణుండే, శాంతిశమదమాది సద్గుణంబులుఁగలవాఁడే, సకల విద్యావిశారదుండే, నామము నకుఁ దగినటుల సత్యవంతుఁడే, ధార్మికుఁడే కాని వాని యా యుర్దాయ మిఁకవత్సరముతో ముగియుచున్నది. అందుచేనల్పా యుర్దాయముఁ గలవానిని నీకూఁతురు వరునిఁగాఁ గోరుట యెంతయుఁ గూడనిపనికదా, ” యని పలికెను.

నారదునివాక్యము లనిన వట్టివి గావనియు, ససత్యా లాపములకాతఁడెన్నఁడునోడఁబడఁడనియుఁబ్రతివారికినమ్మకమే యగుటంజేసి యశ్వపతి తనయదెసఁ జూచి “అమ్మా! వినుచుంటివిగదా నారదవాక్యంబులు? ఎఱిఁగి యెఱిఁగి గోతఁబడుట కేరైన సమ్మతింతురా? అన్యు నెవ్వరినైనఁ గోరి కొనరాదా!” యన సావిత్రి,

“తండ్రీ, అటు లొనర్చుట ధర్మవ్యతిరేకము. పతి వ్రతాలక్షణముల కయ్యది విరుద్ధంబు. ప్రతిదియుఁ గర్మ ననుస రించి జరిగితీఱును. విరించి నన్ను సృష్టించునాఁ డేగీతల నాఫాలతలంబున గీచెనో వానిఁ దప్పింప నేరికిని సాధ్యంబు కాదు. స్త్రీజనంబునకుఁ బాతివ్రత్యంబును మించిన తపంబు లేదని యార్యులు మున్నే నిర్ధరించిరి.

గీ. మనమునఁ దలంచి యొకటి; వాక్కున మఱొండు
    చెప్పినను లేక చేసినఁ ♦ జేతచేత

నాత్మవంచకు లను నప ♦ ఖ్యాతిఁ జెంది
యిహాపరంబుల కెందుకు ♦ నేనిఁ దగరు.

వరాన్వేషణమునకై నాకు సర్వాధికార మొసఁగ
డొసంగితిరో నాఁడే నేఁగోరిన పురుషుని విషయమున నడ్డుఁ
జెప్పెడి యధికారముమీకుఁ దొలఁగిపోయినది. మనమున
నే నాసుందరాంగు నెన్నఁడు వరించితినో నాఁడే యతండు
నా మనోహరుఁడయ్యెను. ఒకరిపైఁబోకిన మనంబును మఱి
యొకరిపై కిఁ ద్రిప్పుట ప్రతివ్రతాలక్షణవిరుద్ధ మగుటఁజేసి
నామనంబందుల కంగీకరింప కుండె"నని సావిత్రి తన దృఢాభి
ప్రాయమును జనకున కెఱింగింపఁ గూఁతుని పట్టుదల కశ్వపతి
యొంతయు విచారించుచుండ నారదుండు.

చ. గొనములఁబ్రోక నీయనుఁగు ♦
గూఁతురు దీని తలంపు మాన్పఁగా
మనకు నశక్యమింకనను ♦
మానములేల ? నరేంద్రచంద్ర, జ
య్యన నృపసూతికిమ్ము కమ ♦
లానన చేసినపుణ్యగౌరవం
బుననయినం బ్రియుండు పరి ♦
పూర్ణచిరాయురుపేతుఁడయ్యెడున్

[భారతము]

అని పలికిన నారదుని వాక్యంబుల కెడ్డుఁ బలుకఁజాలక తోడనే తన తనయను సత్యవంతునకీయ నిశ్చయించుకొని తన సమ్మతమును మునీంద్రునితోఁ దెలుప నాతండెంతయు సంతసించి రాజుచే వీడ్కోలుఁ బడసి తనదారి వెడలెను. అశ్వపతియు నమాత్యులను, బురోహితులను, బంధుజనంబును, వెంటఁగొని ద్యుమత్సేను వాసస్థలంబగు గహనంబున కరిగెను.

(3)

ద్యుమత్సేనుం డంధుఁడయ్యును యోగ్యుండగు కొమరుని వలనను మహాపతివ్రత యగు భార్యవలనను, సకలోపచారములఁ బొందుచు సుఖియై శ్రీమన్నారాయణ చరణారవింద భజనానందసందోహుఁడై కాలక్షేపముఁ జేయుచుండెను. సత్యవంతుఁడొడలు దాఁచుకొనక వలసిన యింధనంబుల, ఫలాదుల సేకరించుటయం దప్రమత్తుఁడై మెలంగుచు నా ప్రాంతముల వసియించెడి మహాత్ముల కడ సకలధర్మముల గ్రహించుచు, నీశ్వరుని భజియించుచు, సన్మార్గప్రవర్తకుఁడై సంచరించుచుండెను. అశ్వపతి వెంటఁగొనివచ్చిన పరివారమును గొండొకయెడ నిలిపి భార్యను దనయను మాత్రము వెంటఁగొని పాదచారియై ద్యుమత్సేనునిఁ జేరి నమస్కరించి తానెవరో తెలిసికొని, సకల గౌరవంబులఁ బడసి తానటకు విచ్చేసిన కారణముఁ దెలుప ద్యుమత్సేనుండు నవ్వి;

రాజా ! నేఁ గులీనుఁడనే, నీకు సముఁడనే, మన కిరువురకు నీవిధముగా బాంధవ్యము పొసఁగుటయు యుక్తమే. కాని రాజ్యచ్యుతుఁడనై సకల విభవంబులఁ గోల్పోయి, కట్టగుడ్డకును, బండ మంచమునకును, నిలువనీడకును గతి లేక ఘోర విపినముఁ జేరి సకల క్లేశముల ననుభవించు మావంటి వారికిఁ బిల్లనిచ్చుట తగునా?" యని యశ్వపతి కోరికకు సమాధాన మీయ నశ్వపతి "కష్ట సుఖములు, కలిమి లేములు, శాశ్వతములు కావు. ధర్మానురక్తయు, గుణవతియునగు నాతనయ మీ స్థితిగతుల నెల్ల బాగుగా నెఱింగియే నీతనయుని బతిగాఁ గొన వాంఛించుచున్న" దని యెఱింగించుచు నెట్టటో ద్యుమత్సేను నొప్పించి పరివారంబును రావించి సావిత్రీసత్యవంతులకు యధావిధి వివాహ మొనర్చి మెట్టినింట కాలిడిన సావిత్రికి హితంబుల నెన్నిఁటినో గఱపి, తగురీతిఁ బారితోషికముల సమర్పించి పరివారసహితుఁడై తన నగరంబున కరిగెను.

(4)

సావిత్రి వివాహమైనదాది నత్తమామలకుఁ బరిచర్యలొనరించుటం దేమి, పతికనుకూలయై వర్తించుటం దేమి, గృహకృత్యంబుల నిర్వర్తించుటందేమి, స్త్రీ సహజలక్షణములఁ గాపాడుటందేమి, దైవచింతనమునందేమి, యెట్టియేమఱుపాటుఁ జెందక వెలుంగుచు నత్తమామల వలననే గాక భర్త

వలనఁగూడ ననవరతంబును మెప్పుల నందుచుండెను. తానో నర్పు ప్రతికార్యమున శెవ్వరిచే నెట్టి మెప్పులఁ బడయుచున్నను తానట్టి గౌరవమునకుఁ బాత్రురాల నగుచుంటినిగదాయని యెన్నఁడును గర్వింపలేదు. రాచబిడ్డనై యరణ్యావాస సంప్రాప్త మేమని యెవగించుకొనక, తనకు రాణివాస సౌఖ్యంబులు లేక పోయెనేయని విచారింపకఁ, బుట్టినింటివారెట్టి యైశ్వర్యములచేఁ దులఁదూఁగుచున్నను వారివలన నేసహాయమును బడయ వాంఛింపక, నవికావలయు నివికావలయునని బెనిమిటిని వేధింపక, తనమెట్టినింటివా రిట్టి దీనదశయందుండిరని వారి పైరితో మొఱఁబెట్టి సంసారమును రట్టుల పాలొనర్పక, నా యల్పసంసారమునే స్వర్గతుల్యముగా భావించుచు సావిత్రి కాలక్షేపముఁ జేయుచుండెను.

ఇటులఁ దన జీవియాత్రను గడుపుచుండియు, సావిత్రి నారదుండు వచియించిన వాక్యములను మఱువక దినంబుల లెక్కపెట్టుకొనుచుండెను. ఇఁక నాలుగుదినములు మాత్రమే తన భర్త కాయువు కలదు. అందుచేఁ దన పతికి దీర్ఘాయువు చేకూఱుటకై త్రిరాత్రోపవాసమును బ్రారంభించి యా వ్రత మును జయప్రదముగానెఱవేర్చుచు, నాలుఁగవనాఁడు యథా విధిగఁ దాను నిర్వర్తింపవలసిన కృత్యముల నన్నిఁటి నెరవేర్చి, సమిధలకొఱకై యాపరిసరప్రాంతముల కరుగుచున్న భర్తతో దానుఁగూడఁ బయనమయ్యెను. సత్యవంతుఁ డరణ్యసంచార

కష్టములఁ గూర్చి సాకల్యముగ నివేదించి వలదని నివారించెను. కాని మృత్యుదేవతను జయింపవలెనని గోరి దృఢాభిప్రాయమున నాఁడెట్లయినఁ బతి ననుసరించియుండఁ గట్టికట్టుఁ బెట్టిన సావిత్రి యంతటితో వెనుకంగ వేయఁగలదా ?

"నాథా! మున్నెన్నఁడును ముచ్చటకేని నొక్క కోరిక నేని గోరియుండనైతిని. మిమ్ముల సొమ్ము నిమ్మని వాంఛింపను. మీ కెట్టి యాయాసముఁ గూర్పను. వనలక్ష్మీవైభవంబును మీ వెనువెంట నంటియుండి విలోకింప నర్హురాలను గానా! మీ కర్థాంగలక్ష్మి నైనందుల కింత మాత్రపు కోరికఁ గోరుకొనుట కేని నాకధికారము లేదా!" అని సావిత్రి మొఱవెట్టెను.

"అబలా! గడచిన నాల్గుదినంబుల నుండియు శుష్కోపవాస నియతిచేఁ గృశించియుండి నేఁడిట్టిశ్రమ వహింపఁ దలఁచుట పాడిగాదని వచియించితిఁగాని నీకోరిక నిరాదరించి నీ మనంబునకు వ్యథఁ గల్పింపవలెనని నాయుద్దేశము కాదు. మార్గములు కంటకావృతంబులు. అటనటఁ గాన్పించునవి భీకర మృగంబులు. వాని గర్జననినదంబులు గుండియ లవియఁ జేయును. కాన నామాట వినవలయు"నని మృదులఁ బలుకుచు నామెను వారింప సత్యవంతుఁ డెంతయో యత్నించెను. గాని వాని యత్నంబు లామెకడ నుపకరింపలేదు. అత్తమామలయాజ్ఞఁ గొనిరమ్మని సత్యవంతుఁ డనెను. అందులకామె యొడంబడి

వారి యనుమతిఁ బడసెను. చివరకామె విస్మయమే సార్థకమై పతితోఁడ వనంబుల కరిగెను.

(౫)

ఎన్నఁడు నెట్టికోరికనుఁ గోరని హృదయేశ్వరి నేఁడువన శృంగారమును జూడ వాంఛించుటచే నామె యెడఁ దనకుఁగల ప్రేమవాత్సల్యములఁ బ్రకటింప సంతుష్టాంతరంగుఁడై త్రోవ యందుఁ గాన్పించెడి కాసారములను, కాసారములయందుండెడి కమలములను; నందు సంచరించెడి హంసరాజములను, నానా విధ ఫలభూజములను, బూలతలను, బూలతలపై మ్రోఁగుచున్న షట్పదఝుంకారమును, జిలుకలను, గోరువంకలను, కోకిలలను, జింకలను, వర్ణించి చూపుచు నామె కెంతయు మోదంబొదఁ గూర్చుచుఁ బ్రయాణము సాగించుచు, నెట్టునెటులో గమ్య స్థానముఁ జేరి సత్యవంతుడు తన భార్యకు నిలువఁదగిన తావొ కండుఁ జూపి యందు విశ్రమింపఁ గోరెను. కాని సావిత్రియటఁ గూర్చుండుటకై వెడలినదా? పతి ననుసరించి యుండుటకును, వాని కెట్టి శ్రమఁ గలుగనీకుండుటకునై యున్నది గానభర్తతోఁ గలిసి చేతనున్న బుట్టనిండ ఫలాదుల సేకరించినది. ఇంతలో సత్యవంతుఁడు వలసిన సమిధల సేకరించుటకై యందొకవృక్షం బును గొడ్డలితో నఱకుచుండెను. క్రమముగాఁ గొంతసేపటికి వాని హృదయమునుండి చెమట కారఁ జొచ్చెను. శిరో

వేదన మతిశయిల్లెను. నిలువఁ జాలక క్రిందఁ జతికిలఁబడి యెను. భార్యదెసఁ జూచెను. "దేవీ! నేఁడేలకో నాశరీరః మస్వాస్థతగా నున్నది. ఇంచుకంత విశ్రమించినఁగాని యేకార్యము నెఱవేర్పఁ జాలకుంటిని. కాన నిటఁ గొంతతడవు పరుండెద"నని పలుక సావిత్రి తన తొడపైఁ బెనిమిటి శిరంబు నిల్పి, పరుండఁబెట్టి నారదుండు వచియించిన రీతి నిముషంబులు లెక్కపెట్టుచుండెను. తనకు మరణసమయ మాసన్నమైనదని సత్యవంతుఁ డెఱుంగఁడు. వానికి శిరోవేదనము క్రమముగా వృద్ధి యగుటయే గాక నూర్పుసన్నగిల్లుటయుఁ గరచరణంబులు చలువలఁ గ్రమ్ముటయు సంభవించినది. నాడులుజాఱుచుండెను. ఆసమయంబున కేభీకరవిగ్రహుండును, పాశహస్తుండునునగునొక దివ్యపురుషుండు తన పెనిమిటి ప్రక్కఁజేరి యేమియో చూచుచున్నటుల గోచరమాయెను. వెంటనే పతి శిరంబును క్రిందదించి శరీరమునందు వణఁకుదయించినను లేని ధైర్యమును గొంత తెచ్చుకొని "దేవా! మహానుభావా! నీవెవ్వరవో గ్రహింపఁజాలకుంటి. నీ నామధేయాదుల నెఱింగించియిచ్చోటకు విచ్చేసిన గతంబెఱుంగఁజెప్ప వేఁడెద"నని వినయంబున నాపురుషునిఁ బ్రశ్నింప నాతండు,

"సాధ్వీమణీ! నేను యముండనెడివాఁడ. దక్షిణదిశ కధినాధుఁడను. కాలముఁదీఱినవారిని పాశబద్ధులఁగావించి నాలోకమునఁ గొనిపోయి వారి వారి సుకృతదుష్కృతముల ననుస

రించి యెవ్వరి నెక్కడకుఁ జేర్చవలయునో అక్కడకుఁ జేర్చు చుండుట నావిధి. విధి బలవత్తరమగుటచేతను, నీభర్త పుణ్యాత్ముఁడును, సత్యసంధుఁడును గాన వాని సుకృతము ననుసరించియు, యోగ్యతల ననుసరించియు దూతల నంపక నేనేస్వయముగా రావలసివచ్చినది. అఖండతపశ్శాలులకుఁ గాని నేను గాన్పింపను. నీపాతివ్రత్య మహిమముచే నన్నుఁ జూడఁ గల్గితివి. పతివ్రతలతో సంభాషించుటనిన నాకు మిగుల నాసక్తి. కాని నేనిట నెక్కుడుకాలము నిలుచుట కవకాశము లేదు. నాకు సెలవిమ్ము. పోయివచ్చెద" నని సమాధాన మొసంగుచుఁ దాను వచ్చినపని నెఱవేర్చుకొని దక్షిణదిశాభిముఖుఁడై పోవుచుండెను.

సావిత్రి దుఃఖమునకు మేరలేదు. కాని యామె నట నోదార్పఁగలవారెవ్వరు? ఆమెకామెయే ధైర్యముఁ జెప్పుకొనవలయును. పతివ్రతయగుటఁజేసి తన యాత్మశక్తిని వినియోగించి, సావిత్రీదేవి కరుణచే నా యముని వెంట నంటి పోఁదొడంగెను. యముండు కొంతదూరమరిగి వెనుకకుఁ దిరిగిచూచి సావిత్రి తన్ను వెంబడించుచుంటఁగాంచి, "నారీమణీ! ఏల నింతదూరము వచ్చితివమ్మా! ఇఁక రాకుము. ముందుతోవ నీ కసాధ్యము. నీకును, నీభర్తకును ఋణము తీరియే పోయినది. పొ" మ్మని మందలింప సావిత్రి "దేవా!

నేను సనాతనధర్మము ననుసరించి నా పతివెంట నరుగుచున్న దాన. అట్టి నన్నడ్డుట కెవరికి నధికారము లేదు. మఱియు,

క. గురుభక్తియు, నీ కరుణయుఁ
బరమ పతివ్రతము తపము ♦ భర్తృస్నేహం
బురువుగఁగల నేను దయా
కర ! యరుగఁగరాని తెరువు ♦ కలదే యెందున్.

అంతియగాక నేఁడుమాట లాడినంతనే యెట్టివారైన మిత్రులగుదు రనెడి యార్యోక్తిని మీకు నేను దెలుప నక్కఱలేదు. అట్టిచో నేను నీకుఁ జుట్టంబుఁగా లేదా ?" యని వాని పలుకులకు సమాధానమొసంగుచు వెన్నాఁడిపోవుచునే మఱికొన్ని ధర్మబద్ధములగు రహస్యముల నెఱింగించెను.

ఆమెపలుకులకు, ధైర్యమునకుఁ, బ్రియమునకు, రూపమునకు, గుణములకు నక్కఱతనయుండు హృదయంబున నెంతయు సంతసించి "సావిత్రీ ! నీవు నన్ను వెంబడించి యెట్లయిన నొప్పించి, నీ పతిప్రాణములఁ గొనిపోఁదలంచితివి. కాని నేనట్టి కార్యమున కొడంబడుట కసమర్థుండ. నీయొక్క ధార్మిక ప్రవృత్తి స్వయముగా నెఱుంగుటచేఁ గలిగిన సంతోషముచే నొండువరముఁ బ్రసాదించుచున్నాఁడ. నీ పతిప్రాణముఁదక్క నన్యమేదైనఁ గోరుకొ" మ్మన నారీతిలకంబు "మహాత్మా ! నీదయ కెంతయు సంతసించితి. సిరిసంపదలఁ గోలుపోయి, యం

ధులై, వనవాస మొనర్చుచున్న నా మామగారికి నేత్రములఁ బ్రసాదించి తగిన బలమొసంగు”మని యర్థింప నట్లొసంగి “తలోదరీ! ఇఁక వెడలిపొ”మ్మని బ్రతిమాలెను. సావిత్రి వినక మఱల నా దివ్యునివెంట నడుచుచుండెను. మఱికొన్ని ధర్మముల వానికెఱింగించుచుండెను. వాని మనంబున దయా బీజము లంకురించునటుల సంభాషించుచుండెను.

అంతకునకు జాలి వొడమినది. “అహా! యీపె వచనంబు లెట్టివానినైనను విజ్ఞానవంతులఁ గావించుచున్నవే!” యని యాశ్చర్యముఁ జెందుచు బాలా! నీకు ద్వితీయ వరమును గూడ బ్రసాదించితిని. నీ నాథుని ప్రాణముఁగాక నన్యమును వాంఛింపు”మన నా సావిత్రి “మహానుభావా! వైరులచే నాక్రమింపఁబడిన రాజ్యము మఱల నా మామగారికి సంక్రమించునట్లును, దన్మూలమున నచిరకాలమున వారికి సమస్త సౌఖ్యములుఁ గలుగునట్లును ననుగ్రహింపు”మని ప్రార్థింప నా యముం డందులకును నట్లనే వరంబుఁ బ్రసాదించి తనత్రోవన నడచుచుండెను. మఱల సావిత్రి వాని ననుసరించెను. శ్రాద్ధదేవుండు “నారీమణీ! ఏల వృథాశ్రమ పడియెదవు? నీవెట్టి కష్టములకులోనైనను నీకోరిక నెఱవేఱునది కా”దనియామెను విముఖురాలిఁ జేయ నెంతయుఁ బ్రయత్నించెనుగాని యామె పట్టినపట్టు వదలదయ్యె. మీఁదు మిక్కిలి దయామయా! ఆర్యధర్మములఁ బరిత్యజించుట నీకు యుక్తంబుగాదు. నీకు

నీనామమును సార్థకముఁజేసుకొనియెడి తలంపు లేదా? నీ హృదయమునఁ గరుణ యనునది లేదా? ఆర్తజనరక్షణము ధర్మజ్ఞున కవశ్యకము కావలసినదే గదా! నిన్ననుసరించి వచ్చు, నా కష్టములఁగూర్చి జాలిఁ జెందుచుంటివిగాని "పతికొఱకై గదా యీ సతి యీలాంటి కష్టముల కోర్చుచున్న"దనెడి పరితాపము లేదుగదా!" యని యింకనేమేమో పలుకుచు నా దుర్గమ మార్గముల నడుచుచునే యుండెను. దండధరుఁ డామెను మఱియొక వరముచేనేనిఁ దృప్తురాలిఁ గావింపఁదలఁచి భూపుత్రీ! తృతీయవరముఁగూడఁ బ్రసాదించుచుంటి, నీ జీవితేశ్వరుని జీవితముఁదక్క మఱియొండేదైనఁ గోరికొను"మన సావిత్రి తనతండ్రికి నూరుగుర నౌరసుల నొసంగ నర్థించెను. ఆ వైవస్వతుండును నావర మొసంగి మఱల నడచుచుండెను. సావిత్రి మఱల వెన్నంటెను. యముండు మఱల వారింపఁ జూచెను. విఫలమనోరథుండయ్యెను. ఇంకొక్క వరము ననుగ్రహించెను. ఆసాధ్వియుఁ దనకుఁ దనయులు కలుగునటుల వాంఛించెను. ఆయమ్మ యుక్తికిఁ గాలుండు మెచ్చుకొని యటులనే యొసంగితినని మాటనిచ్చి మఱలఁ దన ప్రయాణమును సాగించుచుండెను. మఱల సావిత్రి యెప్పటియట్ల నడచుచుఁ "గరుణామయా! ఆడి తప్పరాదు. సజ్జను లసత్యమున కొప్పికొనుట లోకదూష్యంబు. లోకపాలకులే యధర్మమునకొడిఁగట్టుకొనిన నింకధర్మదేవతకునీడయేయుండఁజాలదు.

నాపతి ప్రాణంబుల గొనిపోవుచు నాకుఁ బుత్రభిక్షఁ బెట్టితివిగదా! అదియెటుల సమ్మతంబు? నీవొసంగినవరము ననుకూలమ్మున సాగనిమ్ము. నీబిరుదంబుల నిలుపుకొ”మ్మని మొఱఁబెట్టసాగెను. దండధరుండింక నేమిసేయఁగలఁడు? ఆమెపతిని యామెకొసంగకతప్పినదికాదు. అంతటితోనటనిలువఁబడి “సాధ్వీమణీ! నీవచనములు నానడకకుఁ బ్రతిబంధలాయెఁగదా! మున్నెన్నఁడిట్టి విపరీతము నే నెఱుంగ. నేఁటికిఁబతివ్రతల శక్తిసామర్థ్యముల స్వయముగాఁ గనుఁగొంటి. వారిశక్తిని మించినది మఱెయొండు లేదనెడి యాదార్థ్యమును గుర్తించితి. నీపెనిమిటిని నీకుఁ గరుణించితి. నీకుసకల సుఖంబులుఁ గరతలామలకమై యొప్పుఁగాక! నీభర్త నన్నూరువత్సరంబులాయువుఁగలిగి, ధార్మికప్రవృత్తిచే ధరాచక్రంబును బాలించుచు బహుక్రతువుల నాచరించి శ్రీమన్నారాయణుని యనుగ్రహముఁ బడయుఁగాక! నేనొసంగిన వరంబులన్నియు నీకు శుభప్రదములై దనరాఱుఁగాక!”యనియామెనుదీవించితనవీటికిఁబోయెనంతసావిత్రి తనవిజయంబున కెంతయు నుప్పొంగుచుఁ గళేబర రూపముననున్న పెనిమిటి కడకువచ్చి మఱలఁ దన తొడపైఁ బెనిమిటి శరీరమును నిల్పుకొని యుండ గాఢనిద్రాపరవశునివోలె నాకస్మికముగ మేల్కాంచినటులఁ గన్నులఁ దెఱచి లేచి కూర్చుండి తన హృదయేశ్వరిఁగాంచి “జీవితేశ్వరీ! నేనిట్టి గాఢనిద్రఁ జెందినపుడు లేపవలదా? కాలాతీతంబయ్యెనని నా

తలిదండ్రు లాఁకటిబాధచే నెంత తపించుచుండిరో!" యని యనుచుఁ దాను స్వప్నమున నొక దివ్యపురుషునిఁ బొడఁగాంచినట్లును, నాతఁడు తనపాశములచేఁ దన్ను బంధించి యెటకో పోవుచున్నట్లును, స్వప్నవృత్తాంతముఁ జెప్పుచుండఁ "బ్రాణేశ్వరా! అయ్యది స్వప్నంబు కాదు. నిజముగనే జరిగిన"దని సమాధానమొసంగుచు నడచిన వృత్తాంతమంతయు నివేదించిన పిమ్మట సత్యవంతుఁడు తన సతీమణిసాహసమున కచ్చెరువంది తా నావఱకుఁ గొట్టియుంచిన కట్టెలమోపును, సేకరించియుంచిన ఫలాదులను గొని యాకసంబున మబ్బులు దట్టమై నలుదెసల వ్యాపించినను, గాఢచీకట్లుక్రమ్మినను, నా భయంకరవనంబును గడచి మెల్లఁగ నాశ్రమమునకు భార్యాసహితుఁడై నడచుచుండెను.

సావిత్రియొక్క సాధ్వీత్వమిట్టిదని వర్ణించి చెప్పుట దుస్తరమైనను నామె మహిమవలననే సత్యవంతుని శిరోవేదనము మున్నగు బాధ లడంగినవని మాత్రము తెలుపఁదగును.

సత్యవంతుఁడు నిజసతీయుతుఁడై యాశ్రమముఁ జేరుసరికి దండధరుం డొసంగిన వరప్రభావంబుచే ద్యుమత్సేనుండు దృష్టిపాటవముఁ జెందియుండెను. కాని కొమరుండును, కోడలును నింక నాశ్రమమునకుఁ జేరక నింత చీకటి పడువఱకెచ్చట నుండిరో యనెడి దిగులున నుండెను. సావిత్రి

సత్యవంతులఁ జూచిన తోడనే ద్యుమత్సేనుండును వాని భార్యయుఁ బెన్నిధిఁ గన్న పేదచందమున నెంతయు సంతుష్టాంతరంగులైరి. చుట్టుపట్ల నున్న మునీంద్రులును ద్యుమత్సేనున కప్రయత్నముగా దృష్టి లభియించి నందులకుఁ దమ హర్షముఁ బ్రకటింపవచ్చి యటనే యుండిరి గాన సత్యవంతుని జాప్యమును గూర్చి ప్రశ్నించిరి. అందుల కాతఁడు తనకుఁ దెలిసినంత వట్టు వచియించి యూరకుండ, సావిత్రి యరణ్యమునకు బయలుదేరినది మొదలు మరల నాశ్రమముఁ జేరువఱకు నడచిన వృత్తాంత మంతయు నివేదించి యటఁగల వారి నెల్ల నానందవారాన్నిధి నోలలాడఁ జేసెను. అంత నామహర్షులు ద్యుమత్సేనునకు మరల లోకమును వీక్షింపఁగల భాగ్యమబ్బుటకు సావిత్రీదేవి పాతివ్రత్య మహిమమే కారణ మని యామె నెంతయుఁ బొగడిరి. వారికిఁ దోఁచిన దీవెనల నొసంగి వెడలిరి.

మఱునాఁడే సావిత్రిపొందినవరము లక్కఱకువచ్చెను. సాళ్వదేశ మాక్రమించిన పరరాజు బలవన్మరణంబుఁ జెందుటయుఁ దత్కారణంబున నాదేశ మరాజకమగుటయుఁ బ్రజలు సకల సన్నాహములఁ గావించుకొని వచ్చి ద్యుమత్సేనుని, వాని కుటుంబమును సగౌరవముగాఁ గొనిపోవుటయు జరిగినది. ద్యుమత్సేనుండు మరల రాజ్యాధికారమును స్వీకరించి ధర్మ

బద్ధుఁడై కొంతకాలము రాజ్యమేలి పిమ్మటఁ దనయునకు రాజశ్రీ నొప్పగించి తాను విశ్రాంతిఁ గైకొనెను.

సత్యవంతుఁడు తన నామమును సార్థకంబుఁ గావించుకొనుచు, వైవశ్వతుని వరముచే నన్నూఱువర్షంబులు మని సుతశతంబునుబడసి తన కీర్తిలతను దశదిశలఁ బ్రాకించుకొనియెను.

"నాకు బుత్రసంతానముఁ దక్క పుత్రికాసంతానము వల"దని మొఱబెట్టిన యశ్వపతి, దేవీ ప్రోత్సాహంబునఁ గూఁతునే బడసినను, నాకూఁతురే, యల్పాయువు గల సత్యవంతునే, తానుగాఢముగా మనసార వరియించిన మహామహునే. భర్తఁగాఁబడసి, పాతివ్రత్యధర్మములఁగ్రమము దప్పక నాచరించుచు, యమునియంతటి వానితోఁబోరాడి తనభర్త ప్రాణములసంరక్షించుకొనుటయేగాక, నత్తమామలకును, దలిదండ్రులకును, సంతానభాగ్యమును గలుగజేసి, సమస్తైశ్వర్యముల బ్రసాదింపఁజేసి, పుత్రికాసంతానమువలనఁగూడ మనుజులుకీర్తిఁజెందుట కాధారమున్నదని లోకమునకుజాటి యెల్లవారి మెప్పులకు బాత్రురాలైనది. చూచితిరా ?

సావిత్రీదేవి తన పాతివ్రత్యమును నీవిధముగా లోకమునకు విశదపఱచి తన నామమును జిరస్మరణీయముగ నుండునటుల మహామహులచే సువర్ణాక్షరములతో లిఖింపఁజేసికొని, తన చారిత్రమును విన్నవారికిని, బఠించుకొనినవారి

కెని, తన యాచారముల నాచరణలోనికిఁ దెచ్చుకొనెడివారి కిని సకల శుభంబుల నొడఁగూర్చుచుఁ గాపాడుచున్నది. ఇట్టి మహనీయురాలి జీవితమును బఠించుటచే మనముఁ గూడ నెంతయు ధన్యులమేకదా !

మ హి మా ం గ న లు

మొదటిభాగము

స ం పూ ర్ణ ము.

---

ఏలూరు శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలయందు
పాలి వేంకట మునియ్యగారిచే ముద్రింపఁబడియె.